# షిరిడి సాయి సందేశాలు



పగలు రేయి ధ్యానం - పరమాత్మునిలో లీనం


రచన & ప్రచురణ : **తటవర్తి వీరరాఘవరావు**



2021వ సంవత్సరం: ఐదు ముద్రణలు

ప్రతులు : 25,000

వెల : **రూ. 60/-లు**



**పుస్తకముల కొరకు**

**తటవర్తి వీర రాఘవరావు**

**తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.**

**సెల్ : 9490171853, 9440309812**

email : balajipyramid.bvrm@gmail.com

# విషయ సూచిక



# "ఆలోచించండి"

ప్రపంచంలో అంతా తమకిష్టమైన దేవుణ్ణి తమకిష్టమైన రీతిలో ఆరాధిస్తూ, తమ కోరికలు తీర్చమని, తమ కష్టాలు తొలగించమని అర్థిస్తూంటారు. అలా కొంతమంది పూజలు చేసి కోరితే, కొంతమంది ప్రార్థన ద్వారా, మరికొంత మంది నమాజు ద్వారా కోరుతూంటారు. ఇంకా కొంతమంది భజన చేసి కోరుతూంటారు.

అందరూ అలా ఆరాధిస్తూ అర్థిస్తున్నారు కానీ అంతటి గొప్పవాడైన ఆ దేవుడు చెప్పింది మాత్రం ఆచరించరు. ఆ దేవుడిని ప్రార్థించడానికి ప్రాముఖ్యం ఇస్తారు కానీ ఆయన చెప్పింది పాటించడానికి ప్రాముఖ్యం ఇవ్వరు. ఎంతసేపూ ఆయన అంతటి వాడు, ఇంతటి వాడు అంటూ ఆయన గొప్పతనాన్ని కీర్తిస్తారు, ఆయన మహత్యాలు చెప్పుకుంటారు. ఆయన కంటే గొప్పవాడు లేడంటారు.

ఆలోచించండి అంతటి గొప్పవారు చెప్పేవి, వారిచ్చే సందేశాలు ఎంత గొప్పవై వుంటాయి. మరి అంతటి గొప్పవారు చెప్పినవి ఆచరించాలి కదా? మరి ఆచరించటానికి ఎంతమంది ప్రాముఖ్యం ఇస్తున్నారు? వారిని ఎంతమంది ఆదర్శంగా తీసుకుంటున్నారు?ఎంతసేపూ ఆ దేవుళ్ళు గొప్పవారు అంటూ వారి మహత్యాలను కథలు, కథలుగా చెప్పే వారిని అనుసరిస్తున్నారు కానీ... అంతటి మహత్యాలు కలిగిన ఆ దేవుళ్ళు చెప్పింది మాత్రం ఎవరూ పట్టించుకోవడం లేదు, పాటించడం లేదు, ప్రాముఖ్యం ఇవ్వడం లేదు. తెలివైన వారు గొప్పవాడైన దేవుడ్ని అనుసరిస్తారు. అంతే కానీ ఆ దేవుడు గొప్పవాడు అని చెప్పేవారిని అనుసరించరు. అందుచేత ఆ దేవుళ్ళు చెప్పింది ఆచరిద్దాం. వారు భోధించిన మార్గంలో పయనిద్దాం. జీవితాన్ని ధన్యం చేసుకుందాం.

సామాన్యులు ఆలోచించే విధానానికి అంతటి మహానుభావులు బోధించే దానికి చాలా తేడా వుంటుంది. ఎందుచేతనంటే సామాన్యులు ఎంతసేపూ తాత్కాలిక లాభాలు, తాత్కాలిక ఆనందం, తాత్కాలిక సుఖాలకే ప్రాముఖ్యం ఇస్తారు. కానీ అంతటి మహానుభావులు శాశ్వత లాభాలు, శాశ్వత ఆనందం కోసం ప్రయత్నించమని, పొందమని బోధిస్తారు. ఎందుచేతనంటే తాత్కాలికమంటే కొంతకాలం వుండేది. శాశ్వతమంటే ఎప్పుడూ వుండేది. తాత్కాలికం ఎప్పుడూ తాత్కాలికమే! శాశ్వతమే గొప్పది. అందుచేత గొప్పదైన శాశ్వత మార్గాన్నే బోధిస్తారు.

ఉదాహరణకు సామాన్యుల ఆలోచనా విధానం, అంతటి వారు జీవించిన విధానం ఎలా వుంటుందో చూద్దాం. షిరిడీ బాబానే తీసుకుందాం. చాలామంది షిరిడీ బాబా చాలా శక్తిమంతుడు, ఆయన్ను అర్థిస్తే ధనవంతులం కావచ్చని ఆయన్ను ఆరాధిస్తూ, భజనలు చేస్తూ ధనాన్ని ప్రసాదించమని, తనను ధనవంతుణ్ణి చేయమని

ప్రార్థిస్తారు. వారి ఉద్దేశ్యమేమిటంటే బాబాకు వున్న అనంతమైన శక్తిలో కొద్దిపాటి శక్తి తమకు ప్రసాదించితే, కొంచెం ఆయన అనుగ్రహించితే, తాము ధనవంతులు కావచ్చని సామాన్యులు, ఇంకా... ఇంకా... కోటీశ్వరులు కావచ్చని ధనవంతులు ఆయన్ను ప్రార్థిస్తున్నారు కానీ అంతకన్నా ఆలోచించడం లేదు.

ఆలోచించండి బాబాకు వున్న అనంతమైన శక్తిలో కొద్ది పాటి శక్తి ఇస్తేనే తాము ధనవంతులై భోగభాగ్యలతో తులతూగవచ్చని బాబాను ప్రార్థిస్తున్నారే? మరి కొద్దిపాటి శక్తితో అన్ని భోగభాగ్యాలు ఇవ్వగలిగిన ఆయన, ఆయనకున్న అనంతమైన శక్తితో ఎన్ని బంగ్లాలు నిర్మించుకోవచ్చు? ఎన్ని సంపదలు సమకూర్చు కోవచ్చు? రాజ ప్రాసాదాలే నిర్మించుకుని విలాస వంతమైన సౌకర్యాలు సమకూర్చు కుని, ఖరీదైన వస్త్రాలు ధరించి, నిత్యము షడ్రసోపేతమైన విందులు ఆరగించి, పనివారితో పరిచారికలతో రాజ భోగాలు అనుభవించవచ్చు కదా? మరి ఆయన అలా చేసాడా? అలాంటి భోగాలు అనుభవించడానికి ప్రయత్నించాడా? లేదే!

బాబా స్వప్నంలో కూడా ఈ ప్రాపంచిక ధనాన్ని, విలాసవంతమైన వస్తువులను కాంక్షించలేదు. వాటన్నిటిని బాబా తృణప్రాయంగా భావించారు. ఆయన వాటికి ఏ మాత్రం ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఇచ్చి వుంటే ఆయన ప్యాలెస్‌లోనే నివసించి వుండెడి వారు. కానీ ఆయన అలా కాకుండా మసీదులో వుండేవారు. ఆయన పట్టు పీతాంబరాలు ధరించలేదు, చిరిగిన వస్త్రాలు ధరించారు. షడ్రసోపేతమైన పదార్థాలు ఆరగించలేదు, ఏదో దొరికినది, భిక్షతో జీవించేవారు. అంతటి మహానుభావులై వుండి కూడా, అతి సామాన్యంగా జీవించేవారు. ఆయన ఎప్పుడూ విలాస జీవితం గడపలేదు. అతి సామాన్య జీవితమే గడిపేవారు. కానీ బాబాను ఆరాధించేవారు మాత్రం బాబాను విలాసవంతమైన జీవితాన్ని ప్రసాదించ మని, ధనాన్ని ప్రసాదించమని ప్రార్థిస్తూ వుంటారు. అంటే ఆయన దేనికైతే ప్రాముఖ్యం ఇవ్వలేదో అదే ప్రసాదించమని ఆయన్ను ప్రార్థిస్తున్నారు. అంటే వారంతా ఆయన్ను ఏమి అర్థం చేసుకున్నారు? ఆయన నుంచి ఏమి నేర్చుకున్నారు?

ఎందుచేతనంటే ప్రస్తుతం మానవులు ధనానికి, భార్యాపుత్రులకు, సంసారానికి, సుఖాలకు ప్రాముఖ్యం ఇస్తున్నారు. అంతే కానీ శాశ్వత మోక్షానికి ప్రాముఖ్యం ఇవ్వడం లేదు. దాని ప్రాముఖ్యం గుర్తించడం లేదు.

లోకంలో మానవులు ఈ స్థితిలో వున్నపుడే బాబా లాంటి యోగీశ్వరులు ఉద్భవించి వారిని సరైన మార్గములో నడిపించి, వారికి సరైన ప్రవర్తన తెలియ చేస్తారు. వారి ధర్మాన్ని బోధిస్తారు. అలాంటి వారిలో ముక్తాభాయి, తుకారామ్, ఏకనాధుడు, రామదాసు, కబీరు, వివేకానందుడు లాంటి వారెందరో వున్నారు. (ఈ విషయమే శ్రీ సాయి సచ్చరిత్రలో 4వ అధ్యాయంలో 30వ పేజీలో చెప్పబడింది).

అందుచేత వారిని ఆరాధించడం కాదు వారు చెప్పింది ఆచరించాలి. వారిని అర్థించడం కాదు, వారిని ఆదర్శంగా తీసుకోవాలి. వారిని ప్రార్థించడం కాదు. వారు బోధించినవి పాటించాలి. వారిని గొప్పవారు అనటం కాదు, మనము కూడా గొప్పవారిలా ప్రవర్తించాలి. వారి మహత్యాలను చెప్పుకోవడం కాదు, మహిమాన్వితులైన వారి సందేశాలు అర్థం చేసుకోవాలి, ఆచరణలో పెట్టాలి, అటువంటి వారి జీవితమే ధన్యం.



# సాయిబాబా ఎవరు?

షిరిడీ సాయిబాబాను ఆరాధించే వారు ముఖ్యం గా బాబా గురించి తెలుసుకోవాలి. బాబాను అర్థం చేసు కోవాలి. ఆయన గురించి తెలుసుకోకుండా చేసే ఆరాధనలన్నీ వ్యర్థమవు తాయి. ఆయన్ను అర్థం చేసుకోకుండా చేసే పను లన్నీ నిరర్థకమవుతాయి.

ముఖ్యంగా ప్రతీ ఒక్కరు ఈ క్రింది ప్రశ్న లకు సమాధానం తెలుసుకోవాలి. (1) ఆయన ఎవరు? (2) ఎలా వుంటారు? (3) ఎక్కడ వుంటారు?

చాలా మందికి ఈ ప్రశ్నలు ఆశ్చర్యం కలిగించవచ్చు. ఎందుచేతనంటే ఈ మాత్రం మాకు తెలియదా అనుకుంటారు. చాలామందికి ఆయన గురించి వున్న అవగాహన ఏమిటంటే? ఆయన దేవుడు. ఆయన ఎలా వుంటాడు? అంటే రోజు మేము చూస్తున్నాము కదా? ఆయన ఫోటో మా ఇంట్లో వుంది ఆయన విగ్రహం గుళ్ళో వుంది. ఇంకా ఆయన ఎలా వుంటాడో తెలియదా? అని అనవచ్చు. అలాగే ఆయన ఎక్కడ వుంటాడు? అన్న ప్రశ్నకు కొంతమంది గుళ్ళో వుంటాడు, షిరిడీలో వుంటాడు అని భావిస్తారు. మరి కొంతమందికి ఆయన ఒకప్పుడు షిరిడీలో వుండేవారు అనే అవగాహన వుంది.

కానీ బాబా గురించి ఈ రకమైన అవగాహన సరిపోదు. ఆ ప్రశ్నలకు సరైన సమాధానం తెలుసుకున్నవారే నిజమైన భక్తులు. దానికి అనుగుణంగా ప్రవర్తించే వారి జీవితమే ధన్యం. అందుచేత ముఖ్యంగా ఆ మూడు ప్రశ్నలకు సమాధానం తెలుసుకుందాం.

**మొదటి ప్రశ్న :** ఆయన ఎవరు? అంటే ఆయన "ఆత్మ". ముఖ్యంగా ప్రతీ ఒక్కరూ ఇది తెలుసుకోవాలి. ఆయన 'ఆత్మే' కానీ అందరూ అనుకునే, కనిపించే ఆ రూపం కాదు. అందరూ బాబా అనుకునే ఆ రూపం లోక కళ్యాణం కోసం ఆయన తాత్కాలికంగా ధరించినది మాత్రమే.

ఇదే విషయం "శ్రీ సాయి సచ్చరిత్రము"లో ఉపోద్ఘాతంలో "సాయిబాబా ఎవరు?" అనే శీర్షికలో చెప్పడం జరిగింది. బి.వి.నరసింహస్వామి గారు రచించిన "బాబా సూత్రములు – పలుకులు" అన్న గ్రంథ పీఠికలో ఇలా వ్రాసారు.

"బాబా దేహము మాయమైపోయినది కానీ దానిలో (ఆ దేహంలో) అప్పుడున్న బాబా మాత్రమే ఇప్పటికీ అనంత శక్తివలె నిలచి (వుండి), వారు

సమాధి చెందకముందు భక్తులకు తోడ్పడినట్టే (సహకరించినట్లే) ఇప్పటికీ వారిని ఆశ్రయించు అసంఖ్యాక భక్తులకు నిశ్శబ్దముగా సహాయపడుచున్నారు".

దీనిని బట్టి కనిపించే రూపం బాబా కాదు. దానిలో వున్న 'శక్తి' అంటే 'ఆత్మే' బాబా అని మనం స్పష్టంగా తెలుసుకోవచ్చు. అందుచేత **'ఆత్మే' బాబా** అని తెలుసుకోవాలి. ఇదే విషయం శ్రీ బి.వి.నరసింహస్వామి గారు రచించిన "భక్తుల అనుభవములు" అను పుస్తకములో ఒక హైకోర్టు జడ్జి గారు కూడా ఇలా వ్రాసారు.

**"నా దృష్టిలో వారు అన్ని పరిమితులకు అతీతులు. వారు మా మధ్య వున్నపుడు వారి మానవ శరీరము మా కనుల ముందు సంచరించుచుండెడిది. కానీ ఎక్కువ భాగము మా ఎరుకలో నిలచినది మాత్రం వారి అనంతతత్వమే (ఆత్మే). ఇప్పుడు అశాశ్వతమైన ఆ దేహము మాయమై 'సాయిబాబా' అను శాశ్వతమైన అనంత శక్తి (ఆత్మ) మాత్రము నిలిచియున్నది".**

దీనిని బట్టి అశాశ్వతమైన దేహము బాబా కాదు. శాశ్వతమైన అనంతశక్తివంతమైన 'ఆత్మే' బాబా అని ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. ఎందుచేతనంటే శరీరం బాబా అయితే ఆయన ఇపుడు లేనట్టే. కానీ 'ఆత్మే' బాబా కాబట్టి ఆయన ఇంకా వున్నట్టే. ఇప్పుడే కాదు. ఎన్ని యుగాలు మారినా బాబా వుంటారు.

అంతేకాదు బాబా తాను ఆత్మనని తానే స్వయంగా చెప్పడం జరిగింది. 44వ అధ్యాయంలో 323వ పేజీలో "నేనగా ఎవరు?" అనే పీఠికలో బాబా **"నన్ను వెదకుటకు నీవు దూరముగాని, మరెచ్చటికి గాని పోనక్కరలేదు. నీ నామము, నీ ఆకారము (ఈ దేహం నేను, దీనికున్న పేరు కూడా నేనే అనే భావం) విడిచినచో నీలోనే గాక అన్ని జీవులలోను, చైతన్యము లేదా అంతరాత్మ అని ఒకటి వుంటుంది. "అదే నేను". దీనిని నీవు గ్రహించి నీలోనే గాక అన్నిటిలోను నన్ను చూడుము. దీనిని నీవు అభ్యసించినచో సర్వవ్యాపకత్వం అనుభవించి (అంటే అంతా నేనే, అన్నీ నేనే అన్న విషయం గ్రహించి) నాలో ఐక్యం పొందెదవు"** దీనిని బట్టి ఆత్మే బాబా అని స్పష్టంగా తెలుసుకోవచ్చు.

మరి 'ఆత్మ' బాబా అయినపుడు

**రెండవ ప్రశ్న :** ఆయన ఎలా వుంటాడు? అంటే ఆత్మ ఎలా వుంటుంది? అంటే ఆత్మకు రూపం లేదు. ఆత్మ నిత్యమైనది. శాశ్వతమైనది, సత్యమైనది. ఆత్మకు చావు, పుట్టుకలు లేవు. అంటే ఆత్మ పుట్టలేదు. అందుచేత ఆత్మకు చావు లేదు. ఎప్పుడూ, ఎల్లప్పుడూ వుండేది. ఆత్మ అనంతశక్తివంతమైనది. ఆత్మ అంతటను వ్యాపించి వున్నది. అన్నిటిలో వున్నది. ఆత్మ అన్నిటికీ ఆధారమై వున్నది. ఆత్మ మానవ ఇంద్రియాలకు గోచరము కాదు. మానవ ఇంద్రియాలకు ఆత్మను

తెలుసుకునే శక్తి లేదు. ఇలా చెప్పుకుంటూ పోతే ఆత్మ గురించి ఎంతైనా చెప్పుకోవచ్చు. ఆత్మ గురించి ఎంత చెప్పుకున్నా! ఎంత తెలుసుకున్నా తక్కువే! కారణం ఆత్మే భగవంతుడు కనుక! ఆత్మే దైవం కనుక! ఆత్మే బాబా! ఆత్మే శివుడు! ఆత్మే కృష్ణుడు! ఆత్మే జీసస్! ఆత్మే బుద్ధుడు! ఆత్మే అన్నీ. అందుకే బాబా కృష్ణుడులా కనిపిస్తాడు. శివుడిలా కనిపిస్తాడు. దత్తాత్రేయుడిలా కనిపిస్తాడు అంటారు.

కారణం అన్నీ భగవంతుడే. అన్నిట్లో వున్నది భగవంతుడే. అందుచేత బాబా ఎలా వుంటాడు? అంటే ఆత్మ రూపంలో అంటే ఆయన కనబడని శక్తి రూపంలో వుంటాడు. అంటే **ఆయన కనబడే రూపం కాదు. కనబడని శక్తి.**

మూడవ ప్రశ్న... ఆయన ఎక్కడ వుంటాడు?

ఆయన అంతటా, అన్నిట్లో వ్యాపించి వుంటాడు. అన్నిట్లో అంటే సమస్త భూతాలలో అంటే సమస్త ప్రాణులలో అంటే మానవులలో, జంతువులలో, పక్షులలో, జలచరాలలో, ఆఖరికి చీమలలో, దోమలలో కూడా బాబా వున్నారు. అన్న సంగతి ప్రతీ ఒక్కరూ తెలుసుకోవాలి.

ముఖ్యంగా బాబా భక్తులమనుకున్న వారు తెలుసుకోవాలి. అందుచేత ఏ జీవిని ప్రేమించినా బాబాను ప్రేమించినట్టే. ఏ జంతువుతో స్నేహం చేసినా బాబాతో స్నేహం చేసినట్టే. ఏ జీవిని హింసించినా బాబాను హింసించినట్టే. అందుచేత బాబాను ఇష్టపడేవారు ఆయన్ను హింసించకూడదు. అంటే జీవహింస చేయకూడదు. జంతువులను చంపి వాటి మాంసాన్ని తినకూడదు. అలా చేసిన వారు బాబాను హింసించిన వారవుతారు. బాధించినవారవుతారు. ఈ విషయాన్ని సాయి సచ్చరిత్ర ద్వారా మనం ఎన్నో సందర్భాలలో తెలుసుకోవచ్చు.

(1) శ్రీ సాయి సచ్చరిత్రములో 23వ అధ్యాయంలో 172వ పేజీలో ఈ విధంగా చెప్పబడింది. **"ఎవరిని నిరాదరించుట గాని, అవమానించుట గాని వారెరగరు. సమస్త జీవులలో బాబా, నారాయణుని గాంచుచుండెడివారు".** దీనిని బట్టి అన్ని జంతువులు, జీవులు భగవత్ స్వరూపాలని మనం తెలుసుకోవచ్చు.

(2) అలాగే 22వ అధ్యాయంలో 170వ పేజీలో తేలు, పాము గూర్చి బాబా అభిప్రాయము అన్న శీర్షికలో స్వయముగా బాబా ఇచ్చిన సందేశం చూద్దాం. **"భగవంతుడు సకల జీవులందు నివసించుచున్నాడు అవి సర్పములు కానీ, తేళ్ళు గాని కానిండు. కాబట్టి మనము కనికరించి అన్ని జీవులను ప్రేమించవలెను. అనవసరమైన కలహములందు, చంపుటయందు పాల్గొనక ఓపికతో నుండవలెను. అందరినీ రక్షించువాడు దైవమే".**

దీనిని బట్టి ఏ జంతువును చంపకూడదని ఆఖరుకు తేలు, పామును

సైతం చంపకూడదని. కారణం అన్ని జంతువుల రక్షకుడు దైవమే అని బాబా చెప్పిన దాన్ని బట్టి మనకు అర్ధమవుతుంది.

(3) మరొక ఉదాహరణ చూద్దాం. 9వ అధ్యాయం 81వ పేజీలో బాబాకు సంతుష్టిగా భోజనము పెట్టుట ఎట్లు? అన్న శీర్షికలో ఆత్మారామ్ తర్షడ్ భార్య షిరిడీలోని ఒక ఇంట్లో భోజనము అందరికీ వడ్డించినపుడు ఆకలితో



వున్న కుక్క వచ్చి మొరగడం మొదలెట్టింది. అపుడు తర్షద్ భార్య ఆ కుక్కకు ఒక రొట్టె విసిరింది ఆ కుక్క ఎంతో ఇష్టంగా ఆ రొట్టె తినడం జరిగింది.

ఆ రోజు సాయంత్రం ఆమె మసీదుకు పోయినపుడు బాబా ఆమెతో ఇట్లన్నారు. **"తల్లీ నాకు కడుపు నిండా గొంతు వరకు భోజనము పెట్టినావు. నా జీవ శక్తులు సంతుష్టి చెందినవి. ఎల్లపుడు ఇట్లే చేయుము. ఇది నీకు సద్గతి కలుగచేయును. ఈ మసీదులో కూర్చుండి నేను ఎప్పుడూ అసత్యమాడను. నా యందు ఇట్లే దయయుంచుము. మొదట ఆకలితో వున్న జీవికి భోజనము పెట్టి తరువాత నీవు భుజింపుము. దీనిని జాగ్రత్తగా జ్ఞాపకముంచుకొనుము".**

బాబా అలా అనగానే ఆమెకు ఇదేమీ అర్థం కాలేదు. వెంటనే ఆమె ఇలా అన్నది. "బాబా! నేను నీకెట్లు భోజనము పెట్టగలను? నా భోజనము కొరకే నేను ఇతరులపై ఆధారపడి వున్నాను. నేను వారికి డబ్బిచ్చి భోజనము చేయుచున్నాను". ఆమె అలా అనగానే బాబా ఇలా జవాబిచ్చారు. **"నీవు ప్రేమ పూర్వకముగా పెట్టిన ఆ రొట్టె ముక్కను తిని యిప్పటికీ త్రేనుపులు వస్తున్నాయి. నీ భోజనమునకు ముందు ఏ కుక్కను నీవు చూసి రొట్టె పెట్టావో అదియు నేను ఒకటే! ఆ విధంగానే పిల్లులు, పందులు, ఈగలు, ఆవులు మొదలైనవన్నీ నా అంశలే. నేను వాని ఆకారములో తిరుగుతున్నాను. ఎవరవుతే సకల జీవ కోటిలో నన్ను చూడగలుగుదురో వారే నా ప్రియ భక్తులు. కావున నేను వేరు, తక్కిన జీవరాశి అంతా వేరు అనే ద్వంద భావాన్ని, భేధాన్ని వదలి నన్ను సేవింపుము".**

బాబా చెప్పిన పై మాటలను బట్టి సమస్త జంతువులు దైవ స్వరూపాలని ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. ఏ జంతువును ప్రేమించినా బాబాను ప్రేమించినట్టే. అలాగే ఏ జంతువును హింసించినా బాబాను హింసిచినట్టేనని తెలుసుకోవాలి. నాలుక రుచి కోసం జంతువులను, పక్షులను చంపి వాటి మాంసం తిని, వాటి

హింసకు కారకులయ్యేవారు బాబాను హింసిస్తున్నారని తెలుసుకోవాలి. అలా బాబాను హింసించే వారు ఎన్ని ఆరాధనలు చేసినా, భజనలు చేసినా ఆయన అనుగ్రహాన్ని ఎలా పొందగలరు? అందుచేత బాబా అనుగ్రహం పొందాలనుకున్న వారు జీవహింస చేయకూడదని తెలుసుకోవాలి.

ఇదే సందర్భంలో చెప్పబడిన నీతి : "జీవులన్నిటియందు భగవంతుని దర్శింపుము. ఉపనిషత్తులు, భగవద్గీత, భాగవతము మొదలగునవన్నీ దైవాన్ని ప్రతీ జీవి యందు చూడమని ప్రబోధించుచున్నవి".

(4) అలాగే ఇంకొక సందర్భంలో జరిగిన విషయం బాబాకు ఒక భక్తుడు మూడు నెలల గుర్రపు పిల్లను బహూకరిస్తాడు. బాబా తుకారామ్‌ను ఆ గుర్రపు పిల్లను జాగ్రత్తగా చూసుకొమ్మని చెప్తాడు. తుకారామ్ ఒకరోజు అది గడ్డి తినడం లేదని కొరడాతో రెండు దెబ్బలు కొట్టాడు. తరువాత బాబా తుకారామ్‌ను కబురు చేసి నన్ను ఎందుకు కొట్టావు? అని ప్రశ్నించారు. అపుడు తుకారామ్ నేను మిమ్మల్ని ఎక్కడ కొట్టాను? అని ఆశ్చర్యంగా అన్నాడు. **అపుడు బాబా తన చొక్కా ఎత్తి తనకు తగిలిన రెండు దెబ్బలు చూపించాడు.** అపుడు తుకారామ్ సాయి పాదాల మీద పడి క్షమించమని చెప్పి అప్పటి నుండి ఆ గుర్రాన్ని ప్రేమగా పెంచాడు.

దీనిని బట్టి ఏ జంతువును హింసించినా బాబాను హింసించినట్టేనని తెలుసుకోవాలి. జంతువులను హింసించి చంపితే ఆ హింస బాబాకు చెందుతుందని తెలుసుకోవాలి. అందుచేత మాంసం కోసం జంతువులను చంపకూడదు. ఏ జీవిని హింసించకూడదు.

(5) అలాగే 42వ అధ్యాయములో 314వ పేజీలో బాబా ఆకలిగా వున్నది అనగానే లక్ష్మీభాయి రొట్టె చేసి తీసుకు వస్తే బాబా దానిని ఒక కుక్కకు వేశారు. అదేమిటని ఆమె అడిగితే బాబా **"అనవసరముగా విచారించదవేల? కుక్క ఆకలి తీర్చుట నా ఆకలి తీర్చుట వంటిది. కుక్కకు కూడా ఆత్మ కలదు. ప్రాణులు వేరు కావచ్చును. కానీ అందరి ఆకలి ఒక్కటే. కొందరు మాట్లాడగలరు. కొందరు మూగవాని వలె మాట్లాడలేరు. ఎవరవుతే ఆకలిగానున్న వారికి అన్నము పెట్టెదరో వారు నాకు అన్నము పెట్టినట్టే. దీనినే గొప్ప నీతిగా ఎరుగుము".**

దీనిని బట్టి బాబా సర్వ జీవుల యందు ఉన్నాడని తెలుసుకోగలము. బాబా సర్వవ్యాపి, చావు పుట్టుకలు లేనివారు, అమరులు. అందుచేత ఏ జంతువును హింసించ కూడదు. చంపకూడదు. అంతేకాదు అన్నిట్లలో ఆయన వున్నాడు కాబట్టి మనం ఏమి చేసినా ఆయనకు తెలుస్తుందని తెలుసుకోవాలి. గుడికి వెళ్ళి మనం కోరినవి, చెప్పినవి మాత్రమే ఆయనకు తెలుస్తాయని ఇంటి దగ్గర కోడిని, మేకను చంపి మాంసం తింటే బాబాకు తెలియదని మనం

అనుకుంటే మనం అజ్ఞానులమే అవుతాం. బాబా గురించి తెలియనివారమే అవుతాం. బాబా గురించి అవగాహన లేనివారమే అవుతాం. బాబా గురించి అర్థం చేసుకోని వారమే అవుతాం.

ఈ విషయాన్ని శ్రీ సాయి సచ్చరిత్ర 3వ అధ్యాయంలో 27వ పేజీలో స్వయంగా బాబా అక్కడ వున్న భక్తులకు చెప్పడం జరిగింది.

**"మీరెక్కడ వున్ననూ, ఏమి చేయుచున్ననూ నాకు తెలియునని బాగా జ్ఞాపక ముంచుకోండి. నేను అందరి హృదయములు పాలించువాడను. అందరి హృదయములలో నివసించువాడను. (అంటే అందరిలో వున్నానని స్పష్టంగా చెప్పారు) నేను ప్రపంచంలో గల చరాచర జీవకోటిని ఆవరించి వున్నాను. ఈ జగత్తును నడిపించువాడను, సూత్రధారి నేనే! నేనే జగన్మాతను, త్రిగుణముల సామరస్యమును నేనే, ఇంద్రియ చాలకుడను నేనే, సృష్టి స్థితిలయ కారకుడను నేనే. ఎవరైతే తమ దృష్టిని నావైపు త్రిప్పెదరో వారికి హాని గాని, బాధ గాని కలుగదు. నన్ను మరచిన వానిని మాయ శిక్షించును. పురుగులు, చీమలు తదితర దృశ్యమాన చరాచర జీవకోటి యంతయు నా శరీరమే. నా రూపమే!"**

పై సందేశం బాబా స్వయంగా అక్కడ వున్న భక్తులకు ఇచ్చింది. అంటే ఆయన భక్తులందరికీ ఇచ్చిన దివ్యమైన సందేశం. ఇక్కడ కూడా "పురుగులు, చీమలు తదితర చరాచర జీవకోటి అంతా నా శరీరమే, నా రూపమే" అని చెప్పడం జరిగింది. దీనిని బట్టి ఏ జంతువును హింసించినా బాబాను హింసించినట్టే! ఏ జంతువును ప్రేమించినా, బాబాను ప్రేమించినట్టే! ఏ జంతువుకు సేవ చేసినా బాబాకు సేవ చేసినట్టే. అందుచేత ఏ జంతువును చంపకూడదు. హింసకు కారకులు కాకూడదు.

అందుచేత ఆయన గొప్పవాడు అనుకుంటే సరిపోదు. ఆయన ఇచ్చిన సందేశాన్ని అర్థం చేసుకుని దానిని ఆచరణలో పెట్టాలి. అలా చేసిన వారే ఆయన చెప్పినట్టు ఆచరించినవారవుతారు. వారే నిజమైన భక్తులు. అలా ఆయన చెప్పినట్టు చేయకుండా ఆయన్ను ఆరాధించినా ప్రయోజనం లేదు. ఎందుచేతనంటే ఆయన్ను ఆరాధించే వారి కంటే ఆయన చెప్పినట్టు ఆచరించే వారే లాభం పొందుతారు. వారే నిజమైన భక్తులు.





# బాబా శక్తికి తగ్గట్టు ప్రవర్తించాలి!

బాబా శక్తివంతుడు అని అంటే సరిపోదు. ఆయన శక్తికి తగ్గట్టు ప్రవర్తించిన వారే అర్థం చేసుకున్నవారవుతారు. నోటితో అనే వాడు కాదు ఆచరణలో చూపేవాడే నిజమైన భక్తుడు. వారే బాబాను అర్థం చేసుకున్నవారు.

అందుచేత ఆయన శక్తికి తగ్గట్టు ప్రవర్తించాలి. అంతేకానీ ఆయన శక్తిని తగ్గించి ప్రవర్తించకూడదు. అలా చేసేవారు ఒక రకంగా ఆయనను కించపరచిన వారవుతారు. ఉదాహరణకు కలెక్టరు దగ్గర జవానుతో ప్రవర్తించినట్టు ప్రవర్తిస్తే ఎలా వుంటుంది? ఎస్.పి. దగ్గర కానిస్టేబులుతో ప్రవర్తించినట్టు ప్రవర్తిస్తే ఎలా వుంటుంది? అంటే వారి హోదాకు తగ్గట్టు కాకుండా హోదాను తగ్గించి ప్రవర్తిస్తే వారిని అవమానించినట్టే కదా? అటువంటి వారికి వారితో పనులు అవుతాయా? అవ్వవు కదా? వారితో అవసరం వున్న వారికి లాభం కలుగుతుందా? కలగదు కదా? అలాగే దేవుని విషయంలో కూడా! అంటే బాబా విషయంలో ఆయన శక్తి తెలుసుకుని దానికి తగ్గట్టు ప్రవర్తించాలి.

కారణమేమిటంటే (27వ పేజీలో) బాబా స్పష్టంగా చెప్పారు **"మీరు ఎక్కడ వున్నను, ఏమి చేయుచున్నను నాకు తెలియునని బాగా జ్ఞాపకముంచుకోండి".**

బాబా చెప్పిన దానిని బట్టి ఎవరు ఎక్కడ వున్నా అంటే గుడిలోనే కాదు బయట ఎక్కడ వున్నా అంటే ఇంట్లో కానీ, బజారులో కానీ, షాపులో కానీ, ఆఫీసులో కానీ, ఏ ఊరిలో కానీ అంటే ఎక్కడయినా ఆఖరికి ఎవరికీ తెలియకుండా తలుపులు వేసుకుని గదిలో వున్నా సరే వారు ఏమి చేస్తున్నా అంటే ఎదుటి వారిని దూషించినా! అవమానించినా! కష్టపెట్టినా! నష్టపరిచినా! మోసం చేసినా! అబద్ధం చెప్పినా! భార్యను హింసించినా! పనిమనిషిని కించపరచినా! వ్యాపారంలో, ఉద్యోగంలో లేక ఏ వృత్తిలోనైనా సరే అన్యాయంగా, అక్రమంగా ప్రవర్తించినా! జంతువులను హింసించినా! బాబా తెలుసు కోగలడని ప్రతీ ఒక్కరూ జ్ఞాపకముంచుకోవాలని బాబా స్వయంగా చెప్పిన సందేశం.

మరి ఆయనకు అన్నీ తెలుస్తున్నప్పుడు ఆ పనులన్నీ ఎందుకు చేస్తున్నాం? అలాంటి పనులు బాబా హర్షిస్తాడా? అలాంటి వారిని బాబా అనుగ్రహిస్తాడా? అలాంటి వారు బాబాకు ఇష్టులు కాగలరా? ఆలోచించండి. అన్నీ చేస్తూ ఆయనకు

ఏమీ తెలియదనుకుంటూ అమాయకుల వలే గుడికి వెళ్ళి నాకు ఈ కష్టం వచ్చింది, ఆ కష్టం వచ్చింది... నాకు అది ప్రసాదించు... ఇది అనుగ్రహించు... అని ప్రార్థిస్తాం. ఆయనకు అవసరం లేని, ఆసక్తి లేని కానుకలు సమర్పిస్తాం. భక్తుల వలే ప్రవర్తిస్తాం. మరి మన గురించి మనం చేసే పనుల గురించి ఆయనకు తెలియదా? ఆలోచించండి. అసలు అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాం?

అంతేకాదు గుడికి వెళ్ళినపుడు, గుడిలో వున్నప్పుడు అక్కడ ఎంతో పవిత్రంగా వుంటాం. వినయంగా ప్రవర్తిస్తాం. గుడి నుంచి బయటకు రాగానే మన ప్రవర్తన మారిపోతుంది. ఆ వినయం, ఆ పవిత్రత కనిపించదు. దీని ఉద్దేశ్యం ఏమిటి? మనం గుడిలో చేసేదే బాబా తెలుసుకోగలడు. బయట మనం ఏం చేసినా బాబాకు తెలియదనేగా మన ఉద్దేశ్యం? చూస్తే మన ప్రవర్తన గుడిలో ఒక రకంగా బయట మరొక రకంగా వుంటుంది. దీని ఉద్దేశ్యం బాబా గుడిలోనే వుంటాడు, బయట వుండడనేగా?

అలాగే కొంతమంది బాబా షిరిడీలోనే వుంటాడు. షిరిడీ వెళితేనే బాబాను దర్శించినట్టు అని భావిస్తారు. అలా భావించే వారంతా బాబాను, బాబా శక్తిని అర్థం చేసుకోలేదనే చెప్పవచ్చు.

ఈ విషయమే శ్రీ సాయి సచ్చరిత్రలో 5వ పేజీలో సాయిబాబా ఎవరు? అన్న శీర్షికలో స్వయంగా ఒక భక్తునికి చెప్పారు. ఆర్.ఎ.తర్ఖడ్ గారి స్నేహితుడు ఒకసారి బాబా దర్శనానంతరం బాబా వద్ద శలవు పుచ్చుకుని బొంబాయి తిరిగి వెళ్ళేటపుడు కంట తడిపెట్టాడు. అప్పుడు బాబా ఇలా అన్నారు. **"పిచ్చివాని వలె ప్రవర్తించుచున్నావేమి? నేను బొంబాయిలో మాత్రం నీతో లేనా?"** అని అంటూ ఆయన ఇంకా **"ఎవరైతే బాబా షిరిడీలో మాత్రమే ఉన్నాడని అనుకొందురో వారు బాబాను నిజముగా గ్రహించలేదని తెలుసుకో!"**

బాబా చెప్పిన దానిని బట్టి ఆయన షిరిడీలోను, గుడిలో మాత్రమే వుంటాడనుకోవడం అజ్ఞానం. ఆయన అన్ని చోట్లా వుంటాడని తెలుసుకోవాలి. ఆయన గుడిలోనే కాదు ఎక్కడ వున్నా తెలుసుకోగలడు అన్న జ్ఞానం వున్నవాడు అన్ని చోట్లా పవిత్రంగా వుంటాడు. అలా వుండటం లేదంటే బాబా శక్తి గురించి అవగాహన లేనట్టే! ఆయన శక్తికి తగ్గట్టు ప్రవర్తించనట్టే! అంటే ఆయన శక్తిని తగ్గించి ప్రవర్తిస్తున్నట్టే! అందుకే ఆయన **"మీరు ఎక్కడ వున్నను, ఏమి చేయుచున్నను నాకు తెలియునని బాగా జ్ఞాపకముంచుకోండి"** అని చెప్పారు. ఈ విషయం బాగా జ్ఞాపకముంచుకోవాలి. కారణం చాలా మంది గుడి నుంచి బయటకు రాగానే బాబా తెలుసుకోగలడు అన్న విషయమే కాదు, బాబానే మర్చిపోతారు.

# “సద్గురువు చెప్పింది చెయ్యాలి - చేసింది చెయ్యకూడదు”

ముఖ్యంగా ప్రతీ ఒక్కరూ సద్గురువు ఎవరో తెలుసుకోవాలి. ఎందుచేతనంటే వేషం వేసుకున్నంత మాత్రాన, ఆశ్రమం వున్నంత మాత్రాన, ఏదో నాలుగు ముక్కలు బోధించినంత మాత్రాన సద్గురువు కాలేరు. అటువంటి వారిని ఆశ్రయించిన వారు కష్టాలు పాలు కావలసిందే. అందుకే శంకరాచార్యుల వారి భజగోవిందంలో తోతాచార్యుల వారి సందేశం చూద్దాం.

**“జటిలో ముండీలుంచిత కేశః**
**కాషాయాంబర బహుకృత వేషః**
**పశ్యన్న పిచనపశ్యతి మూఢో**
**హ్యుదర నిమిత్తం బహుకృత వేషః”**

తా:- ఒకడు జడలు ధరించి, మరొకడు ముండనం చేయించుకుని ఇంకొకడు వెంట్రుకలు పెరికేసుకుని, మరొకడు కాషాయ వస్త్రాలు ధరించి వుంటాడు. చూస్తూ కూడా వాస్తవాన్ని చూడలేని ఈ మూర్ఖులు పొట్ట నింపుకోవడానికి అనేకానేక వేషాలు వేస్తూ వుంటారు.

అందుచేత పొట్ట నింపుకోవడానికి వేషాలు వేసే వారంతా భాధ గురువులే కానీ బోధ గురువులు కాదు. ఎవరైనా ఆశ్రయించవలసింది భోధగురువునే కానీ భాధ గురువును కాదు. తెలివైన వాడు వేషాన్ని బట్టి గురువును అంచనా వెయ్యడు. జ్ఞానాన్ని బట్టి గురువు గొప్పతనాన్ని తెలుసుకుంటాడు, ఆశ్రయిస్తాడు. జీవితంలో లాభం పొందుతాడు.

అలాంటి భోధ గురువులలో, సద్గురువులలో, పరమ గురువులలో షిరిడీ సాయిబాబా ఒకరు.

అటువంటి సద్గురువును ఆశ్రయించిన వారు, అనుసరించే వారు ఆ గురువు చెప్పింది చెయ్యాలి. కానీ చేసింది చెయ్యకూడదు. కారణం ఆ గురువు స్థాయికి ఇంకా తాను ఎదగలేదు కనుక, ఎందుచేతనంటే చాలా మంది ఆ గురువులను గమనిస్తూ వుంటారు. వారు ఏమి చేస్తే తాము కూడా అదే చేస్తూ వుంటారు. వారి ఉద్దేశ్యమేమిటంటే గురువు గారు చేసినపుడు మనం చెయ్యడంలో తప్పేమిటి అనుకుంటారు. అందుకే బాబా అలా చేసారుగా? అని అడుగుతారు.

ఇంకా కొంతమంది అలాంటి గురువులు చేసే పనులు చూసి అవేమిటి? వారు అలాంటి పనులు చేస్తున్నారు? చేయకూడని పనులు చేస్తున్నారు? అసలు ఈయన గురువేనా? అని అపోహలు పడడం, అపార్థం చేసుకో వడం వారికి దూరమవ్వడం లాంటివి కూడా లోకంలో చూస్తూ వుంటాం.

కానీ పరమ గురువుల ప్రవర్తన పనులు, చేష్టలు ఎవరికి అర్థం కావు. వారు ఎందుకు చేస్తారో! వారు అలా ఎందుకు ప్రవర్తిస్తారో! సామాన్యులకు అర్థం కాదు. కారణం వారు ఏమి చేసినా వారికి ఏ కర్మా అంటదు. వారు కర్మకు అతీతులు. అంతటి స్థితికి ఎదిగిన వారు. అందుచేత అటువంటి గురువులు చేసినట్టు చెయ్యకూడదు. వారు చెప్పినట్టు చెయ్యాలి. ఇది చాలా ముఖ్యం. అపుడే శిష్యుడు లాభపడతాడు.

ఇదే విషయాన్ని శంకరాచార్యుల వారు తన శిష్యులకు బోధించారు. ఆయన ఒకసారి తన శిష్యులతో ఒక తీర్థానికి వెళ్ళారు. ఆ తీర్థంలో శంకరాచార్యుల వారు ఏమి చేస్తే శిష్యులు అదే చెయ్యడం మొదలు పెట్టారు. ఆయన ఏమి తింటే వారు అదే తినడం, ఆయన కల్లు త్రాగితే వారు కల్లు త్రాగడం చేసేవారు. అలా చెయ్యడం తప్పు కాదని ఆ శిష్యులు భావించారు. సరిగ్గా అదే సమయంలో శంకరాచార్యులు వారు 'సీసం' తీసుకుని దానిని త్రాగారు. ఆయన శిష్యులను కూడా త్రాగమన్నారు. కానీ శిష్యులు త్రాగలేదు, భయపడ్డారు. అపుడు శంకరాచార్యుల వారు అడిగారు ఎందుకు త్రాగరు? అని ఆ శిష్యులు సీసం త్రాగితే చనిపోతాం కదండి? అన్నారు. అపుడు ఆయన నేను త్రాగాను కదా? అన్నారు. మీరు వేరు – మేము వేరు, మీరు గొప్పవారు కదా? అన్నారు. అపుడు ఆయన అర్థమయ్యిందా? **"ఎప్పుడూ నేను చేసింది చెయ్యకండి, నేను చెప్పిందే చెయ్యండి"** అన్నారు.

అలాగే ఒక సందర్భంగా మెహర్‌బాబా వారు భక్తులకు చెప్పిన విషయం ఒక గురువు గారు శిష్యులతో వెళ్ళినపుడు ఆయన బజారులో ఒక షాపులోని స్వీటు నోట్లో వేసుకున్నారట. ఆయన్ను చూసి శిష్యులంతా కూడా తలో స్వీటు నోట్లో వేసుకున్నారట. తరువాత గురువుగారు ఇంకొక కొట్టు దగ్గర మండుతున్న పొయ్యిలోంచి కణకణమండే నిప్పు ఒకటి తీసుకుని నోట్లో వేసుకున్నారట. శిష్యులు ఆశ్చర్యంగా అలా చూస్తూ వుండిపోయారట. అపుడు గురువు గారు శిష్యులను మీరు కూడా వేసుకోండని అన్నారట. అపుడు వారంతా అమ్మో! నోరు కాలిపోదా? అన్నారట. వెంటనే ఆయన మరి నేను వేసుకున్నాను కదా? అని చెప్పారట. మీరు వేరు, మేము వేరు; మీరు శక్తిమంతులు, మేము సామాన్యులము, మీరు చేసినట్టు మేము ఎలా చెయ్యగలం? అని సమాధానం ఇచ్చారట ఆ శిష్యులు.

దీనిని బట్టి సద్గురువు ఏదైనా చెయ్యగలడని మనం అర్థం చేసుకోవాలి. వారు అన్నిటికీ అతీతులు. వారికి అలాంటి శక్తి వుంది. అలాంటి వారు ఇసుక నోట్లో వేసి పంచదార తిను అంటే అది పంచదార అయిపోతుంది. మిరపకాయ ఇచ్చి ఇది చెరకులా వుంటుంది, తిను అంటే వాడు తిన్నా అది తియ్యగానే వుంటుంది కానీ, కారం వుండదు. ఇదంతా వారికున్న శక్తి మహత్యమే కానీ ఇంకొకటి కాదు. అలాగే బాబా వారు చేసేది, వారు పెట్టేది ఎవరికీ అర్థం కాదు.



షిరిడీ బాబా వారు కూడా వంట చేసేటపుడు ఉడుకుతున్న పదార్థంలో గరిటతో కాకుండా చేతితో కలిపేవారట. ఆలోచించండి. వారు చేసారని ఆ గిన్నెలో మనం కూడా చెయ్యి పెడితే ఏమవుతుంది?

అందుచేత వారు చేసారని శిష్యులు చేసినా! ఇంకెవరు చేసినా! నష్టపోయేది, నాశనమయ్యేది చేసేవారే. అందుచేత వారిని అనుసరించాలి అంటే వారు చెప్పింది చెయ్యాలి. మరొక్కసారి తెలుసుకోండి. **"సద్గురువు చెప్పింది చెయ్యాలి. చేసింది చెయ్యకూడదు".**

కొన్ని కొన్ని సందర్భాలలో కొంతమంది వారు చేసారు కదా? మేము చేస్తే తప్పేమిటి? అని వాదిస్తూ వుంటారు. వీరి లెక్కలో సద్గురువు వీరు ఒక్కటే అయినట్టు భావిస్తారు. ఎందుచేతనంటే సద్గురువు ఏది చేసినా? ఏమి మాట్లాడినా? దానికి ఒక కారణం వుంటుంది. ఒక అర్థం వుంటుంది. అది తెలుసుకునే శక్తి, అర్థం చేసుకునే శక్తి సామాన్యులకు వుండదు. వారు అలా ఎందుకు చేసారో తెలియకుండా అలా చేస్తే వారు మూర్ఖులే అవుతారు. జీవితంలో నష్టపోతారు. కష్టాలపాలవుతారు.

అందుచేత ఎవరు తెలివైన వారంటే వారు చెప్పింది చెయ్యటానికి ప్రాముఖ్యం ఇచ్చేవారు, చేసింది చేసేవారు. కారణం సద్గురువే 'సత్యం' కనుక. వారు 'సత్యం'లో జీవిస్తారు. 'సత్యాన్ని' అనుసరిస్తారు. 'సత్యమే' చెబుతారు. కారణం 'సత్యమే' వారు. అందుచేత వారిని అనుసరించాలి అంటే చెప్పింది చెయ్యాలి. అలాంటి వారే సత్యాన్ని అంటిపెట్టుకున్నవారవుతారు. జీవితంలో లాభపడతారు. సద్గురువులు ఏది చెప్పినా, ఏమి చేసినా ఇతరుల లాభం కోసమే.

ఈ విషయం మనం షిరిడీ సాయిబాబా నుంచి స్పష్టంగా తెలుసు కోవచ్చు. కారణం వారు చేసే పనులు, మాట్లాడే మాటలు కొన్ని మనకు అర్థం కావు, కానీ ప్రతీ మాటలో అర్థం, అంతరార్థం దాగి వుంటుంది అన్నది మాత్రం మనం తెలుసుకోవాలి. వాటి అర్థం తెలుసుకోగలిగితే ఎంతో లాభం పొందగలుగుతాం.

(1) సత్యాన్ని అంటి పెట్టుకోవాలి అన్న విషయం బాబా ఒక చిన్న సంఘటన ద్వారా ఎలా చెప్పారో చూద్దాం. (5వ అధ్యాయం, 45వ పేజీ, నీళ్ళను నూనెగా మార్చుట).

సాయిబాబాకు దీపాలంటే చాలా ఇష్టం. ఆయన ఆ ఊరిలో నూనె అమ్మే షావుకార్లను (షాపు వారిని) నూనె అడిగి తెచ్చి మసీదులో రాత్రి అంతా దీపాలు వెలిగించేవారు. కొన్నాళ్ళు ఇలా జరిగింది. ఒక రోజు నూనె ఇచ్చే దుకాణదారులంతా కూడపలుక్కుని బాబాకు నూనె ఇవ్వకూడదని నిశ్చయిం చుకున్నారు. బాబా వారి

దుకాణాలకు ఎప్పటిలాగే వెళ్ళగా నూనె లేదన్నారు. బాబా కలత పడకుండా వట్టి వత్తులు మాత్రమే ప్రమిదలలో పెట్టి వుంచారు. నూనె వ్యాపారులు ఇదంతా ఆసక్తితో గమనిస్తున్నారు. బాబా అడుగున రెండు మూడు నూనె చుక్కలు మిగిలిన వున్న రేకు డబ్బాలో నీటిని పోసి కలియ బెట్టి ఆ నీటిని త్రాగి వేసిరి, మరల డబ్బాతో నీరు తీసుకుని ఆ నీటిని ప్రమిదలలో నింపారు. దూరంగా నిలిచి పరీక్షించుచున్న దుకాణదారులు విస్మయమొందునట్లు ప్రమిదలన్నియు తెల్లవారు దాకా చక్కగా వెలిగాయి. ఇదంతా చూసే ఆ షావుకార్లు పశ్చాత్తాపపడి బాబాను మన్నించమని కోరారు. అపుడు బాబా వారిని క్షమించి, **"ఇకపైనైననూ సత్యమునంటి పెట్టుకోండని హితవు చెప్పి పంపివేసిరి".**

ఇక్కడ బాబా సత్యాన్ని అంటిపెట్టుకొమ్మని చెప్పారంటే! సత్యము ఎవరంటే బాబానే. అంటే బాబాను అనుసరించమన్నారు. అంటే బాబా చెప్పినట్టు చెయ్యమన్నారు. బాబాకు దీపాలంటే ఇష్టం. ఎందుచేతనంటే దీపం జ్ఞానానికి ప్రతీక. వెలిగే దీపపు జ్యోతి ఆత్మజ్యోతికి సంకేతం. అంటే బాబాకు జ్ఞానమన్నా, ఆత్మ అన్నా ఇష్టమని మనం తెలుసుకోవచ్చు. లోకంలో అటువంటి జ్ఞానాన్ని ప్రకాశింపచేయటానికి ఎవరయితే సహకరిస్తారో వారు భవిష్యత్తులో ఎంతో లాభపడతారు. ఆ వ్యాపారస్తులందరికీ లాభం కలిగించటానికే బాబా వారి దగ్గర నూనె తీసుకునేవారు. ఇది వారికి అర్థం కాక నూనె ఇవ్వటానికి నిరాకరించారు. అలా బాబా తన మహిమను చూపించి వారిని సత్యాన్ని అంటి పెట్టుకోమని బోధించారు. అంటే తాను ఏది చెబితే అది చెయ్యమన్నారు. అది వారికే లాభమని తెలియచేశారు.

(2) అలాగే ఆయన భిక్ష అడిగేవారు అంటే అంతటి యోగికి ఎవరైతే భిక్ష ఇస్తారో వారు దాని ఫలితం పొందగలుగుతారు. అలా వారికి ఆ అవకాశం తాను భిక్ష అడగటం ద్వారా బాబా కల్పించేవారు. అంతేకాదు ఎవరికైనా భిక్ష అడగడానికి అహం అడ్డు వస్తుంది. వాడిని నేను అడగడమేమిటి? అని. కానీ అంతటి శక్తులున్న బాబానే భిక్ష అడగగలుగుతున్నారంటే! ఆయనలో అహంకారం లేనట్టే కదా! అలాగే అందరూ అహంకార రహితులవ్వాలనే ఆయన చర్యలోని సందేశం. నిజంగా బాబా భిక్ష అడగాలా? వారికి ఎవరు భోజనం తెచ్చి ఇవ్వరు? నాలాగే మీరూ అహంకార రహితులవ్వండి అని చెప్పడమే ఆయన భిక్ష అడగడానికి కారణం.

అంతేకాదు బాబా చేష్టలు, మాటలు, మర్మగర్భంగా, అంతరార్థాలతో, సందేశాత్మకంగా వుంటాయి. అజ్ఞానుల అజ్ఞానాన్ని తొలగించేవిగా వుంటాయి. మూర్ఖుల మూర్ఖత్వాన్ని తొలగించేవిగా వుంటాయి. అందుచేత ఆయన మాటలు, చేతలలో లోని బాహ్యార్థాన్ని తీసుకోకూడదు. అలా తీసుకున్న వారు నష్టాన్ని పొందుతారు. ఇలా మనం ఎన్నో ఉదాహరణలు ఆయన జీవితం నుంచి చెప్పుకోవచ్చు.

అందుచేత **"సద్గురువు చేసింది చెయ్యకూడదు – చెప్పిందే చెయ్యాలి".**




# బాబాను కోరాలా?

బాబా గుడికి వెళ్ళి మన కష్టాలు, సమస్యలు చెప్పుకుంటున్నాం, కోరికలు కోరుతున్నాం. ఆలోచించండి. అన్నీ ఆయనకు తెలిసినపుడు మనం పడే కష్టాలు ఆయనకు తెలియవా? మన సమస్యలు ఆయనకు తెలియవా? మనకు ఏమి కావాలో ఆయనకు తెలియదా? నాకు అన్నీ తెలుసు అనే కదా బాబా చెపుతున్నారు. మరి ప్రత్యేకించి ఆయనకు చెప్పాలా? తెలియని వారికి చెప్పాలి. అన్నీ తెలిసిన బాబాకు చెప్పడమంటే ఆయన శక్తిని తెలుసుకోకపోవడమే! ఆయన శక్తిని తగ్గించి ప్రవర్తించడమే.

అన్నీ తెలిసిన వారిని కోరకూడదు. **"చెయ్యవలసింది చేస్తే పొందవలసింది పొందుతామని తెలుసుకోవాలి". "కోరటానికి ప్రాముఖ్యం ఇవ్వకూడదు. చెయ్యటానికి ప్రాముఖ్యం ఇవ్వాలి".** మరి కష్టాలు వస్తే మేము ఏం చెయ్యాలన్న సందేహం కలగవచ్చు. కానీ ఏం చెయ్యాలో ఆయనే చెప్పారు. (3వ అధ్యాయం 27వ పేజీ) **"ఎవరైతే తమ దృష్టిని నావైపు త్రిప్పెదరో! వారికి ఏ హాని కానీ, బాధ కానీ కలగదు నన్ను మరచిన వానిని మాయ శిక్షించును"** అని స్పష్టంగా చెప్పారు.

అంటే ఆయన్ను కోరడం కాదు. ఆయన మీద దృష్టి పెట్టాలి. ఇదే ఆయన చెప్పిన సందేశం. కానీ అంతా ఆయన మీద దృష్టి పెట్టడం కంటే కోరడానికే ప్రాముఖ్యం ఇస్తున్నారు. అంటే ఆయన చెప్పింది ఒకటి! అంతా చేసేది మరొకటి! ఆయన చెప్పినట్టు చెయ్యకపోతే ఫలితం ఎలా వస్తుంది? ఆయన అనుగ్రహం ఎలా పొందుతారు?

మరి ఆయన మీద దృష్టి పెట్టాలంటే ఆయన ఎలా వుంటారు? ఎక్కడ వుంటారు? అంటే ఆయన ఆత్మ రూపంలో అందరిలో వుంటారు. ఈ విషయం కూడా శ్రీ సాయి సచ్చరిత్రలో సాయిబాబా ఎవరు? అన్న శీర్షికలో ఆచార్య జి.జి.నార్కే గారు చెప్పడం జరిగింది. **"బాబా నా హృదయంలో గల ఆలోచనలు, కోరికలు గ్రహించుచుండెడివారు. వారు నాలోనున్న భగవంతుడు".** అంటే ఎవరికి వారు తమలో వున్న బాబా మీద అంటే "ఆత్మ" మీద దృష్టి పెట్టాలి. అంటే అంతర్ముఖులు కావాలి. అంటే "ధ్యానం" చెయ్యాలి. అంటే ఎవరయితే ధ్యానం చేస్తారో! వారు బాబా మీద దృష్టి వుంచిన వారవుతారు. అంటే బాబా చెప్పినట్టి చేసినవారవుతారు. వారికి బాబా చెప్పినట్టు ఆయన అనుగ్రహం లభిస్తుంది. అటువంటి వారికి ఏ హాని కలుగదు. వారి భాధలన్నీ పోతాయి. ఇదే బాబా

సందేశం. అందుచేత గుడికి వెళ్ళే వారంతా అక్కడే వున్న ధ్యాన మందిరాలలో కూర్చుని ధ్యానం ద్వారా బాబా మీద దృష్టి వుంచాలి. అందుకే బాబా గుడులలో ధ్యాన మందిరాలు నిర్మించడానికి కారణం.

బాబా గుళ్ళలో, ధ్యాన మందిరాలు ఏర్పాటు చేస్తున్నారు. కానీ ఎవరూ ధ్యానం చెయ్యటం లేదు. బాబా మీద దృష్టి వుంచడం లేదు. ఎంతసేపూ ప్రతిరూపమైన విగ్రహం మీదే దృష్టి పెడుతున్నారు. కోరికలు కోరడంతోటే సరిపెడుతున్నారు. అంతే కానీ ఆయన సత్యరూపమైన ఆత్మ మీద దృష్టి వుంచడం లేదు. ధ్యానం చెయ్యడం లేదు. బాబా చెప్పింది ఎవరూ అర్థం చేసుకోవడం లేదు. అందుచేత బాబా చెప్పినట్లు ఆయన మీద అంటే ఆత్మ మీద దృష్టి వుంచాలి. అంటే ధ్యానం చెయ్యాలి. ఇదే బాబా సందేశం.

43-44 అధ్యాయంలో 323వ పేజీలో అమృత తుల్యమగు బాబా పలుకులు అన్న శీర్షికలో బాబా చెప్పింది చూద్దాం. **"ఎవరైతే సర్వస్య శరణాగతి చేసి నన్నే ధ్యానింతురో వారికి నేను ఋణస్థుదను. వారికి మోక్షమునిచ్చి వారి ఋణము తీర్చుకొనెదను. ఎవరయితే నన్ను (ఆత్మను) చింతించుచూ నా గూర్చియే (ఆత్మ గురించి) దీక్షతో నుందురో, ఎవరయితే నాకు అర్పించనిదే ఏమియు తినరో! (అంటే ఏదో ఒక ప్రాణికి పెట్టి తాను తినాలి. ఇదే విషయం బాబా స్వయంగా 9వ అధ్యాయం 8వ పేజీలో చెప్పారు) అట్టి వారిపై నేను ఆధారపడి వుందును. ఎవరయితే నా సన్నిధానమునకు (ఆత్మ దగ్గరకు అంటే దేహం లోనికి) వచ్చెదరో వారు నది సముద్రంలో కలిసిపోయినట్టు నాలో కలిసి పోవుదురు. కనుక నీవు గర్వము, అహంకారము లేశమైన లేకుండ నీ హృదయము లో నున్న నన్ను (నీలో వున్న నన్ను అంటే ఆత్మను) సర్వశ్య శరణాగతి వేడవలెను".** ఈ విధంగా బాబా చాలా స్పష్టంగా ధ్యానం చెయ్యమని చెప్పడం జరిగింది.

ఇంకా ఆలోచించండి. బాబాకు మేల్కొలుపులు అవసరమా? ప్రస్తుతం శరీరం లేని ఆయనకు ఆకలి వుంటుందా? ఆయనకు నివేదనలు అవసరమా? ఎవరు ఎక్కడ వున్నా? ఏమి చేస్తున్నా తెలుసుకోగల శక్తి వున్న బాబాకు మైకులు పెట్టి భజనలు చెయ్యాలా? మీ మనస్సులో ఏముందో తెలుసుకోగల శక్తి వున్న బాబాకు పూజకు ముందు సంకల్పం చెప్పాలా? అన్నీ తెలిసిన బాబాకు మీ పేరు చెప్పవలసిన అవసరం వుందా? మీ పేరు చెపితే తప్ప మీరే పూజ చేస్తున్నారనే సంగతి ఆయన తెలుసుకోలేడా? పేరే కాదు పేరుతో పాటు గోత్రం కూడా చెపుతూ వుంటాం. అసలు ఇవన్నీ బాబాకు అవసరమా?

ఆలోచించండి. ఆయన శక్తిని అర్థం చేసుకుంటే ఇవన్నీ చేస్తామా? ఇవన్నీ చేస్తున్నామంటే మనం ఆయన శక్తికి తగ్గట్టు ప్రవర్తిస్తున్నామా? ఖచ్చితంగా ఆయన శక్తిని తగ్గించినట్టే.

ఒక రకంగా చూస్తే ఇవన్నీ మన తృప్తి కోసం చేసే పనులు తప్ప బాబాకు అవసరం లేదు. ఆయనకు కావలసింది ఆయన భక్తులు ఆయన చెప్పినట్టు చెయ్యడమే! ఆయన అనుసరించిన మార్గాన్ని అనుసరించడమే. అందుచేత ఆయన చెప్పిన ప్రతీ మాటను, ప్రతీ సందేశాన్ని జాగ్రత్తగా ఆకళింపు చేసుకోవాలి. ఆచరణలో పెట్టాలి. అలా చేసేవారే బాబాకు నిజమైన భక్తులు. వారే ధన్య జీవులు.

బాబా చెప్పినట్టు ఆచరించకుండా ఆయనను కోరికల కోసమే ఆరాధించే వారు ఆయన భక్తులు ఎలా అవుతారు? అసలు ఇవన్నీ వ్రాయడానికి కారణం అందరూ చేసే పనులను విమర్శించడానికి కాదు. బాబాను అర్థం చేసుకుని, బాబా సందేశం ప్రకారం జీవించమని మాత్రమే. మీకు కావాలంటే మీకు తృప్తి కలిగించే పనులన్నీ చేయండి. కానీ ముఖ్యంగా బాబా సందేశాన్ని అర్థం చేసుకుని ఆచరణలో పెట్టండి. ముఖ్యంగా "మీరు చేసే పనులు మీకు తృప్తి కలిగించడం కాదు. బాబాకు తృప్తి కలిగించాయా? లేదా?" అన్నది ఆలోచించాలి. అంతేకాదు "మీరు చేసే పని మీకు నచ్చినట్టు కాదు. బాబా మెచ్చేటట్టు వుండాలి".

ముఖ్యంగా ఎవరైనా సరే బాబా శక్తికి తగ్గట్టుగా ప్రవర్తించాలి. బాబా శక్తిని తెలుసుకోవాలి. బాబా శక్తిని తగ్గించకూడదు. శక్తిని తక్కువ అంచనా వేయకూడదు. మనం ఆయన శక్తిని తగ్గించామా? లేదా? అన్నది మన ప్రవర్తనను బట్టి స్పష్టంగా తెలుసుకోవచ్చు.

మరి బాబా శక్తికి తగ్గట్టు ప్రవర్తించడమంటే? ఆయన కనిపించే శరీరం కాదు. కనిపించని ఆత్మ అని తెలుసుకోవాలి. ఆయన మీద దృష్టి వుంచాలి అంటే ధ్యానం చెయ్యాలి. అంటే గుడికి వెళ్ళినపుడు మొదట కనిపించే ఆయన 'ప్రతి రూపాన్ని' చూసి, దాని తోటే తృప్తి పడక అక్కడే వున్న ధ్యాన మందిరంలో ధ్యానం చెయ్యడం ద్వారా ఆయన కనిపించని 'సత్య రూపమైన ఆత్మ'ను దర్శించడానికి ప్రయత్నించాలి. అలా చేసిన వారికి బాబా 'సత్యరూప దర్శనం' లభిస్తుంది. దీనినే 'ఆత్మ సాక్షాత్కారం' అని కూడా అంటారు. అది లభించిన వారి జీవితమే ధన్యం. వారికి కావలసినవి అంటూ ఏమీ వుండవు. వారు ముక్తి పొందినట్టే. అంటే అన్ని దుఃఖాల నుండి, కష్టాల నుండి, సమస్యల నుండి శాశ్వతంగా బయటపడినట్టే. మామూలు ఆనందం కాదు వారు బ్రహ్మానందాన్ని శాశ్వత ఆనందాన్ని పొందినట్టే! గుర్తుంచుకోండి "విగ్రహ దర్శనం చేసుకుంటే తృప్తి వస్తుంది. కానీ ఆత్మదర్శనం చేసుకుంటే "ముక్తి" వస్తుంది.

నిజంగా మానవుల జీవిత లక్ష్యం కూడా ఇదే! ఏ మానవుడైనా సాధించవలసింది ఇదే! ప్రయత్నించవలసింది ఇదే! అలా 'ఆత్మ సాక్షాత్కారం' పొందిన వారు మాయ నుంచి బయటపడినట్టే! జ్ఞానం పొందినట్టే! అందుచేత బాబా చెప్పినట్టు ఆయన మీద ధ్యానం ద్వారా దృష్టి వుంచుదాం.



# బాబా బోధించిన బ్రహ్మ జ్ఞానం లేదా ఆత్మసాక్షాత్కారం

బాబా మీద దృష్టి వుంచిన వారు అంటే ధ్యానం చేసే వారు నెమ్మదిగా బ్రహ్మజ్ఞానం పొందుతారు. అంటే ఆత్మ సాక్షాత్కారం పొందుతారు.

ఆత్మ సాక్షాత్కారం పొందిన వారు తమ కష్టాల నుంచి, సమస్యల నుంచి శాశ్వతంగా బయట పడతారని అంటే ముక్తిని పొందుతారని తెలుసుకోవాలి. అందరికి ముక్తిని పొందాలని, అంటే ఆత్మ సాక్షాత్కారం పొందాలని వుంటుంది. కానీ అది అంత సులభమైనది కాదు. దానికి కొన్ని నియమాలు పాటించాలి, కొంత యోగ్యత అవసరం.

ఆ యోగ్యత ఎలా వస్తుంది? ఆ నియమాలు ఏమిటి? అన్నది బాబాయే స్వయంగా చెప్పడం జరిగింది. శ్రీ సాయి సచ్చరిత్రలో 16, 17 అధ్యాయాలలో (128-131 పేజీలు) బాబా సందేశం చూద్దాం.

## బ్రహ్మజ్ఞానము లేదా ఆత్మ సాక్షాత్కారమునకు యోగ్యత

**1) ముముక్షత లేదా స్వేచ్ఛ (ముక్తి) పొందుటకు తీవ్రమైన కోరిక :-**

**"ఎవరైతే తాను బద్ధుడనని (బంధములో వున్నానని) గ్రహించి బంధనముల నుండి బయటపడుటకు కృత నిశ్చయుడై (తీవ్రంగా నిర్ణయించుకున్నవాడై) శ్రమపడి (బాగా కష్టపడి) ఇతర సుఖములను లక్ష్యపెట్టక దానిని (ఆత్మ సాక్షాత్కారాన్ని) పొందుటకు ప్రయత్నించునో వాడు ఆధ్యాత్మిక జీవితానికి అర్హుడు".**

**వివరణ :-** ఇక్కడ ఇతర సుఖములు అంటే ప్రాపంచిక సుఖాలు అని అర్థం. వాటినే తాత్కాలిక సుఖాలు అని కూడా అంటాం. అంటే భౌతిక దేహంతో అనుభవించే సుఖాలు అంటే తిండి, బట్ట, ఇల్లు లాంటివి. అవి ఏవి వున్నా వాటికి పరిమితమవ్వగల గాలి, వాటిని ఇంకా... ఇంకా... కావాలని కోరకూడదు. వాటి కోసం తప్పులు, పాపాలు చేయకూడదు. అధర్మంగా ప్రవర్తించకూడదు. అంటే ఆత్మసుఖం తప్ప ఇతర సుఖాలకు ప్రాముఖ్యం ఇవ్వకూడదనే బాబా సందేశం.

**2) విరక్తి లేదా ఇహపర సౌఖ్యములందు విసుగు చెందుట :-**

**"ఇహపర లోకములందు గల గౌరవములకు, విషయములకు విసుగు**

**చెందిన గాని పారమార్థిక రంగములో ప్రవేశించుటకు అర్హత లేదు".**

**వివరణ :-** బాబా చెప్పిన ఈ ఒక్క వాక్యం నుండి మనం ఎంతో సందేశం తీసుకోవచ్చు. ఆ వాక్యంలోనే ఎంతో అర్థం వుంది. బాబా ఏం మాట్లాడినా! ఏ సందేశం ఇచ్చినా అది వూరికే చదివి వదిలేసేది కాదు. దానిలోని అర్థాన్ని, అంతరార్థాన్ని తెలుసుకునే ప్రయత్నం చెయ్యాలి. అలా చెయ్యాలంటే అదే సందేశాన్ని మళ్ళీ మళ్ళీ చదవాలి. ప్రతీ పదం యొక్క అర్థాన్ని ఆకళింపు చేసుకోవడానికి ప్రయత్నించాలి.

ఇక్కడ ఇహ, పరలోకాలు అని చెప్పారు. ముందు దీని గురించి తెలుసుకుందాం. ఈ సృష్టిలో ఇహ లోకము, పరలోకము అని రెండు రకాల లోకాలు వున్నాయి. ఇహ లోకము అంటే మన కంటికి కనపడే లోకాలు. పరలోకము అంటే మన కంటికి కనపడని లోకాలు. మనందరికీ ఇహలోకం గురించి తెలుసు కానీ పరలోకం గురించి తెలియదు.

**"ఇహ పరలోకములందు గల గౌరవములకు, విషయములకు విసుగు చెందిన గాని"** అని బాబా అన్నారంటే ముఖ్యంగా మనకు రెండు రకాల జీవితాలు వున్నాయని తెలుసుకోవాలి. ఒకటి మనకు కనిపిస్తున్న, ఈ దేహంతో అనుభవిస్తున్న ఇహలోక జీవితం. అలాగే మనం ఈ శరీరం వదిలిన తర్వాత అంటే మరణించిన తరువాత మనం పొందబోయే కనబడని పరలోక జీవితం.

అంతేకాదు ఆలోచిస్తే మనకు ఇంకా చాలా సందేశం వస్తుంది. మనమంతా చనిపోతాము, మరణిస్తాము అని అనుకుంటాం. కానీ మరణించిన తరువాత కూడా వుంటాము అని స్పష్టంగా అర్థమవుతుంది. అంటే మనకు చావు లేదని కూడా స్పష్టంగా తెలుసుకోవచ్చు. అందుచేత చనిపోయేది దేహమే కానీ మనము కాదని అర్థం చేసుకోవాలి. అంటే మనకు ఇంకా జన్మలున్నాయని కూడా తెలుసుకోవచ్చు. మరి ఇంకా జన్మలు వున్నాయంటే మనకు ఇంతకు ముందు కూడా జన్మలున్నాయని తెలుస్తుంది కదా?

ఈ విషయాన్నే అంటే ప్రతి ఒక్కరికి ఇంకా జన్మలు వున్నాయని బాబా ఎన్నో సందర్భాలలో చెప్పడం జరిగింది.

(1) (36వ అధ్యాయం 274వ పేజీలో బాబా శ్యామా బుగ్గ గిల్లుట.)

ఒకనాడు శ్యామా మధ్యాహ్న భోజనానంతరము బాబా చేతులు తువాలుతో తుడుస్తుండగా బాబా శ్యామా బుగ్గను గిల్లారు. శ్యామా కోపగించి "దేవా! నా బుగ్గను గిల్లుట నీకు తగునా? మా బుగ్గలు గిల్లునట్టి పెంకి దేవుడు మాకక్కర్లేదు. మేము నీపై ఆధారపడి వున్నామా? ఇదియేనా మన సాన్నిహిత్య ఫలితం?"అని అన్నాడు.

అపుడు బాబా ఇట్లన్నారు **“శ్యామా! 72 జన్మల నుంచి నీవు నాతో వున్నప్పటికీ నేను గిల్లలేదు. ఇన్నాళ్ళకు గిల్లగా నీకు కోపము వచ్చుచున్నది”.**

బాబా మాటలను బట్టి అందరికీ జన్మలున్నాయని మనం స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు. మనకే కాదు మనం దేవుళ్ళనుకునే వారికి కూడా జన్మలున్నాయని వారు ఇంతకు ముందు కూడా ఎన్నో జన్మలు ఎత్తారని దీనిని బట్టి మనం స్పష్టంగా తెలుసుకోవచ్చు. చాలా మందికి వారు అవతార పురుషులని లోక కళ్యాణార్ధం అవతరించారని భావిస్తూ వుంటారు. కానీ బాబా మాటలను బట్టి, బాబా కూడా ఇంతకుముందు ఎన్నో జన్మలు ఎత్తారని తెలుసుకోవచ్చు. ఈ విషయమే భగవద్గీతలో శ్రీ కృష్ణ భగవానుడు కూడా చెప్పడం జరిగింది.

శ్లో॥ **బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।**
**తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥ (భ.గీ.4-5)**

తా:- ఓ అర్జునా! నీకు నాకు ఇంత వరకు అనేక జన్మలు నడిచాయి. కానీ వాటన్నిటిని నేనెరుగుదును. కానీ నీవెరుగవు.

(2) (46వ అధ్యాయం 335 పేజీలో రెండు మేకల కథ)

ఒకనాడు బాబా లెండి వనం నుండి తిరిగి వస్తూ మార్గంలో మేకల మందను చూశారు. అదులో రెండు మేకల మీద బాబా దృష్టి పడింది. వెంటనే ఆయన ఆ రెండు మేకలను రూ.32లకు కొన్నారు. కానీ వాటి కిమ్మత్తు రూ.8లు మించి వుండదు. అది చూసి భక్తులు ఆశ్చర్యపడ్డారు. బాబాను నిందించారు. బాబా ఏమీ అనకుండా వూరుకున్నారు. తరువాత బాబా నాలుగు శేర్ల శనగపప్పు కొని ఆ మేకలకు పెట్టమని చెప్పి, తరువాత ఆ మేకలను యజమానికి తిరిగి ఇచ్చేశారు.



అపుడు శ్యామా, తాత్యాకోతే బాబాను అలా ఎందుకు చేశారని సమాధానం కోరగా బాబా యీ విధంగా చెప్పారు.

“ఓ శ్యామా! తాత్యా! మీరు యీ బేరములో నేను మోసపోయితిని అని అనుకొనుచున్నారు. అట్లు కాదు వాని కథ వినుడు. గత జన్మలో వారు మానవులు. వారి అదృష్టము కొలదీ నా జతగాండ్రుగా నుండెడివారు (నాతో

వుండెడివారు). వారు ఒకే తల్లిబిడ్డలు. మొదట వారికి ఒకరిపై ఇంకొకరికి ప్రేమ ఉండేది. రాను రాను శత్రువులయ్యారు. పెద్దవాడు సోమరి. చిన్నవాడు చురుకైనవాడు. అతడు చాలా ధనము సంపాదించాడు. పెద్దవాడు అసూయ చెంది చిన్నవానిని చంపి వాని ధనం అపహరించాలనుకున్నాడు. తమ సోదరత్వము మరచి వారిద్దరూ కలహించిరి. అన్న తమ్ముని చంపుటకు చాలా పన్నాగాలు పన్నాడు. కానీ అవన్నీ నిష్ప్రయోజనములయ్యాయి. ఇద్దరూ బద్ధ శత్రువులయ్యారు.

అన్న ఒకనాడు తన సోదరుని బడితతో కొట్టాడు. చిన్నవాడు అన్నను గొడ్డలితో నరికాడు. ఇద్దరూ అదే స్థలములో చచ్చిపడిరి. వారి కర్మ ఫలముచే మేకలుగా పుట్టారు. నా ప్రక్క నుండి పోవుచుండగా వారిని ఆనవాలు పట్టితిని. వారి పూర్వ వృత్తాంతము జ్ఞాపకము తెచ్చుకుంటిని. వారి యందు కనికరించి వారికి తిండి పెట్టి కొంత విశ్రాంతి కలుగచేసి ఓదార్చవలెనని అనుకొంటిని. అందుచేత ఇంత ధనం ఖర్చుపెట్టితిని. అందులకు మీరు నన్ను దూషించు చున్నారా? నా బేరము మీకు ఇష్టపడకుండుటచే నేను వాని యజమాని వద్దకు తిరిగి పంపివేసితిని".

బాబా చెప్పిన పై విషయాలను బట్టి ప్రతి ఒక్కరికి జన్మలు వున్నాయని తెలుస్తుంది. మనకు కూడా ఇంకా జన్మలు వుంటాయని స్పష్టంగా తెలుసుకోవచ్చు. అలాగే ఏ జన్మలైనా మనం చేసే కర్మలను బట్టి వుంటాయని కూడా తెలుసుకోవాలి. ప్రస్తుతం మనం ఎంత ధనవంతులైనా! ఎంత గొప్పవారమైనా! మురిసి పోకూడదు. మనం చేసే కర్మలు సరిగ్గా లేకపోతే తిరిగి మనం జంతు జన్మో! లేక ఇంకా హీనమైన, నీచమైన జన్మో పొందవలసి వస్తుందని తెలుసుకోవాలి. మనం చేసే కర్మలు జాగ్రత్తగా చెయ్యాలి. మనకు నష్టం కలిగించే కర్మలు చెయ్యకూడదు. ఎందుచేతనంటే గత జన్మలో బాబాతో సహ జీవనం చేసినా కూడా తాము చేసిన కర్మల వల్ల మానవ జన్మ నుంచి జంతు జన్మకు దిగజారారు కదా! ప్రస్తుతం మన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తే మనం కూడా అలాంటి జన్మలే పొందవలసివస్తుందని ఈ రకంగా బాబా వారు సందేశమిచ్చారు. అందుచేత మన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించి, కర్మలు చేసి బాబాను ప్రార్థిస్తున్నామని, ఆరాధిస్తున్నామని భావిస్తే నష్టపోయేది మనమే.

(3) అలాగే బాబా భక్తుడైన భాగోజీ గత జన్మ గురించి 7వ అధ్యాయం 65వ పేజీలో ఈ విధంగా చెప్పడం జరిగింది. "భాగోజీ గత జన్మలయందు చేసిన పాప ఫలితముగ ఈ జన్మమున కుష్టు రోగముచే బాధపడుచుండెను. వాని వ్రేళ్ళు ఈడ్చుకుని పోయియుండెను. వాని శరీరమంతయు చీము కారుచూ

దుర్వాసన కొట్టుచుండెను"

దీనిని బట్టి గత జన్మలలో చేసిన కర్మలు ఈ జన్మలో అనుభవించవలసి వస్తుందని అవి ఎంత దుర్భరంగా వుంటాయో కూడా ఆ కథల ద్వారా బాబా సందేశాల నుంచి మనం తెలుసుకోగలం. అందుచేత ప్రస్తుతం మనం చేసే కర్మలు ప్రస్తుత జన్మలో కాకపోయినా భవిష్యత్ జన్మలలోనైనా మనం అనుభవించవలసి వుంటుంది.

(4) అంతేకాదు చేసిన కర్మలు కష్టాలు భరించలేక ఆత్మహత్యలు చేసుకుందామనుకున్నా లాభం లేదు. వారి పరిస్థితి ఇంకా దుర్భరమవుతుంది. ఈ విషయం 26వ అధ్యాయంలో 197వ పేజీలో అక్కల్ కోట్‌కర్ మహారాజు గారి కాలంలో జరిగిన ఒక కథ ద్వారా తెలుసుకోవచ్చు.

ఒక భక్తుడు బాగు కాని దీర్ఘరోగంచే బాధపడుతున్నాడు. బాధను సహించలేక నిరాశ చెందిన బావిలో దూకాడు. వెంటనే మహారాజు వచ్చి వానిని బావిలో నుంచి బయటకు తీసి యిట్లన్నారు. **"గత జన్మ పాప పుణ్యములను నీవు అనుభవించక తప్పదు. కర్మానుభవము పూర్తి కాకున్నచో ప్రాణ త్యాగము నీకు తోడ్పడదు. నీవింకొక జన్మమెత్తి బాధయనుభవించవలెను. చచ్చుటకు ముందు కొంతకాలమైనా నీ కర్మను ఎందుకు అనుభవించరాదు? గత జన్మముల పాపముల నేల తుడిచివేయరాదు? అందుచేత దానిని శాశ్వతముగా పోవునట్లు చేయుము"**

అందుచేత ఎవ్వరైనా కర్మల ఫలితం అనుభవించవలసిందే. మన ఆరాధనలు, పూజలు, భజనలు మన కర్మల నుండి మనల్ని రక్షించలేవని తెలుసుకోవాలి.

అందుచేత మన వల్ల ఎవరికైనా, ఏ ప్రాణికైనా కష్టం, నష్టం కలగకుండా జాగ్రత్త పడాలి. లేకపోతే ఆ కర్మల ఫలితం భవిష్యత్తులో తప్పనిసరిగా మనం అనుభవించవలసి వస్తుంది. బాధపడవలసి వస్తుంది. రోగాల పాలు కావలసివస్తుంది. ప్రస్తుతం అందరూ అనుభవిస్తున్న రోగాలకు కారణం గతంలో వారు చేసుకున్న పాప కర్మల ఫలితమే. అందుకే శాస్త్రాలలో "పూర్వ జన్మ కృతం పాపం వ్యాధి రూపేణ పీడ్యతే" అని చెప్పబడింది.

బాబా వారు ఇంకా **"ఇహపరలోకములందు గల గౌరవములకు, విషయములకు విసుగు చెందినగాని"** అన్నారు.

ఇహలోకంలో ప్రతి ఒక్కరూ ధనం ఉంటే గౌరవం అని భావిస్తారు. ధనం పెంచుకోవడానికి, సంపాదించడానికి ఆరాటపడుతూ వుంటారు. ఎంతో కష్టపడుతూంటారు. ధనం కోసం చేయకూడని పనులు చేస్తూంటారు. ధర్మం

తప్పుతారు. దీనికి కారణం ధనం వుంటే గౌరవమని భావించడమే. అంతేకాదు పదవి వుంటే గౌరవం, పెద్ద ఉద్యోగం వుంటే గౌరవం. ఏ రంగంలో గుర్తింపు తెచ్చుకున్నా గౌరవం అనుకుంటారు. వాటి కోసం తాపత్రయపడుతూ వుంటారు. కానీ బాబా వీటి పట్ల విసుగు అంటే విరక్తి చెందాలన్నారు.

అలాగే ఇహలోక విషయాలు అంటే సుఖాలనిచ్చేవి అంటే సంసారం, భార్య, పిల్లలు, బంగళాలు, కార్లు, బంగారం, ఖరీదైన వస్త్రాలు లాంటి వాటి పట్ల విసుగు చెందాలన్నారు బాబా. అంటే విరక్తి కలగాలన్నారు. అంటే వైరాగ్యం పొందాలన్నారు. అంటే ప్రాపంచిక విషయాలు పట్ల మమకారం పోవాలన్నారు. అలా పోతే కానీ ఆత్మజ్ఞానం పొందటానికి అర్హులు కాలేరన్నారు. దీనిని బట్టి చూస్తే బాబా చెప్పిన వాక్యానికి ఎంత అర్థం తీసుకోవచ్చో మనకు తెలుస్తుంది.

**3) అంతర్ముఖత (లోనికి చూచుట) :-**

**"మన ఇంద్రియములు బాహ్యమును చూచుటకే భగవంతుడు సృష్టించి యున్నాడు.కనుక మనుష్యుడెప్పుడును బయట వున్నవారిని చూచును. కానీ ఆత్మ సాక్షాత్కారము లేదా మోక్షమును కోరువాడు దృష్టిని లోపలకు పోనిచ్చి లోనున్న ఆత్మను ఏక ధ్యానముతో చూడవలయును".**

**వివరణ :** ఇక్కడ బాబా చాలా స్పష్టంగా మోక్షం పొందాలంటే ఆత్మ సాక్షాత్కారం పొందాలని దానికి ధ్యానమే మార్గమని ధ్యానం ద్వారా మనలో వున్న ఆత్మ మీద దృష్టి వుంచగలుగుతామని దానికి అంతర్ముఖులవ్వాలని చెప్పడం జరిగింది. భగవంతుడు సర్వాంతర్యామి అంటే అందరి అంతరాలలో ఆత్మ రూపంలో వ్యాపించి వున్నాడు. అటువంటి భగవంతుని అంటే అంతరంలో వున్న ఆత్మను సాక్షాత్కరించుకోవాలంటే ఎవరైనా అంతర్ముఖులు కావలసిందే. దాని మార్గమే ధ్యానం. అంటే ఎవరైనా ఆత్మ సాక్షాత్కారానికి ధ్యానం చెయ్యవలసిందే.

ఇక్కడ కళ్ళు మూసుకుని ధ్యానం చేస్తే అంతర్ముఖులు ఎలా అవుతాం. ఆత్మ మీద దృష్టి ఎలా వుంచగలుగుతాం? ఆత్మ సాక్షాత్కారం ఎలా పొందగలుగుతాం? అన్న సందేహం చాలా మందికి కలుగుతుంది. దీని గురించి కొంచెం వివరంగా తెలుసుకుందాం.

అంతర్ముఖత అంటే లోనికి చూచుట అంటారు. మనం కళ్ళు తెరచి వుంచితే బాహ్య దృష్టే వుంటుంది కానీ అంతర్ దృష్టి వుండదు. అందుచేత కళ్ళు మూస్తాం. కళ్ళు మూయగానే బాహ్యం నుంచి దృష్టి మళ్ళించిన వారమవుతాం. కానీ కళ్ళు ముయ్యగానే ఎవరికైనా ఆలోచనలు వస్తాయి. సహజంగా ఆలోచనలన్నీ బాహ్య విషయాలకు సంబంధించినవే వుంటాయి. అంటే కళ్ళు మూసినా మనం అంతరంలోకి వెళ్ళలేదు. బాహ్య సంబంధమైన

ఆలోచనలతో బాహ్యంలోనే వున్నాం. మరి అంతరంలోకి వెళ్ళాలంటే తప్పనిసరిగా ఆలోచనలన్నీ ఆగిపోవాలి. మనస్సు శూన్యమైపోవాలి.

అలా జరగాలంటే తేలికైన మార్గం "శ్వాస మీద ధ్యాస". ఎపుడయితే ఆలోచనలు వస్తాయో అపుడు ఆలోచనలు కట్ చేసి "శ్వాస మీద ధ్యాస" వుంచాలి. అలా చెయ్యగా... చెయ్యగా... మెల్లిగా... మెల్లిగా ఆలోచనలు తగ్గుతూ... తగ్గుతూ... మనకు తెలియకుండానే ఆలోచనలు ఆగిపోతాయి. అలా ఆలోచనలు ఆగిపోగానే మనం అంతర్ముఖులైనట్టు. అక్కడ దేహము లేదు, మనస్సు లేదు. వున్నది ఆత్మ ఒక్కటే. అలాంటి స్థితిలో వుండగా... వుండగా... కొన్నాళ్ళకు ఆత్మ సాక్షాత్కారం కలుగుతుంది.

అందుకే బాబా అంతర్ముఖులని చెప్పడానికి కారణం.

**4) పాప విమోచన పొందుట :-**

**"మనుష్యుడు దుర్మార్గ మార్గం నుండి బుద్ధిని మరలించనపుడు, తప్పులు చేయుట మాననపుడు, మనస్సును చలించకుండా నిలబెట్టలేనపుడు, జ్ఞానం ద్వారా కూడా ఆత్మ సాక్షాత్కారము పొందలేడు".**

**వివరణ :-** ఎవరి బుద్ధి అయితే సరైన నిర్ణయాలు తీసుకోదో, చేయకూడని పనులు చేయిస్తుందో! అధర్మపు పనులు చేయిస్తుందో! అలాగే మానవుడు తప్పులు చేయడం మానడో, అలాగే కళ్ళు మూసుకున్నప్పుడు మనస్సు చంచలంగా రకరకాల ఆలోచనలతో వుంటుందో అటువంటి వారు ఆత్మ సాక్షాత్కారం పొందలేరని బాబా చెప్పారు.

ఇక్కడ మనస్సు చంచలం అంటే కళ్ళు మూసుకున్నప్పుడు ఎవరికైనా రకరకాల ఆలోచనలు వస్తూ వుంటాయి. కాసేపు గతం గురించిన ఆలోచనలు, కాసేపు భవిష్యత్తు గురించిన ఆలోచనలు. అంటే మనస్సు అటూ ఇటూ వూగుతూ చంచలంగా వుంటుంది. కానీ నిశ్చలంగా వుండదు. ఇది ఆత్మ సాక్షాత్కారానికి అనువైనది కాదు. అందుచేత ముందు మనస్సు నిశ్చలపరచు కోవాలి. దానికి 'శ్వాస మీద ధ్యాస' వుంచాలి. అలా వుంచినపుడు ఆలోచనలు నెమ్మది నెమ్మదిగా తగ్గుతూ కొంతసేపటికి ఆలోచనలన్నీ ఆగిపోయి అదే నిశ్చల స్థితి, ఆత్మసాక్షాత్కారానికి ముందుగా ఇటువంటి స్థితి సంపాదించాలి. అదే బాబా చెప్పిన సందేశం.

**5) సరి అయిన నడవడిక :-**

**"సత్యమును పలుకుచు, తపస్సు చేయుచు, లోన చూచుచు, బ్రహ్మచారిగా ఉండిన గాని, ఆత్మ సాక్షాత్కారం లభించదు".**

**వివరణ :-** వీటి గురించి కొంచెం తెలుసుకుందాం.

**సత్యం :** ముందు సత్యం గురించి తెలుసుకుందాం. ఏది సత్యం? అంటే నిత్యమైనదే సత్యం. ఏది నిత్యమైనది? అంటే శాశ్వతమైనది. ఏది శాశ్వతం? అంటే ఎప్పుడూ వుండేది. ఏది ఎప్పుడూ వుంటుంది? అంటే యుగాలు మారినా మార్పు చెందకుండా వుండేది.

అలాంటిది ఈ సృష్టిలో ఏది వుంది అంటే! ఒక్కటే ఒక్కటి అదే 'భగవంతుడు'. అదే 'ఆత్మ'. అందుచేత 'ఆత్మే సత్యమని' తెలుసుకోవాలి. 'భగవంతుడే సత్యమని' తెలుసుకోవాలి. 'దైవమే సత్యమని' తెలుసుకోవాలి.

బాబా వారు సత్యాన్ని పలకమన్నారు. అంటే ఎప్పుడూ దైవం గురించి మాట్లాడాలి. అంటే ఎక్కువ ఆత్మకు సంబంధించిన విషయలు చర్చించుకుంటూ వుండాలి. ఆత్మ జ్ఞానం గురించి మాట్లాడాలి. చాలామంది సత్యం పలకడమంటే నిజం చెప్పడం అనుకుంటారు. కానీ సత్యం వేరు. నిజం వేరు.

**తపస్సు :** అలాగే బాబా వారు తపస్సు చేయాలి అన్నారు. తపస్సు అంటే ఎక్కడికో వెళ్ళి ఒంటికాలి మీద నిలబడటం కాదు. తపస్సు అంటే తపింప చేసుకోవడం. అంటే శుష్కింప చేసుకోవడం అంటే తగ్గించుకోవడం.

జీవితంలో అన్నిటినీ తగ్గించుకోవడమే తపస్సు. ఋషులులా మెల్లిగా ఆహారాన్ని తగ్గించుకుంటూ వుండాలి. నిద్రను తగ్గించుకుంటూ వుండాలి. మాటలు తగ్గించుకుంటూ వుండాలి. అన్నిటి మీద వ్యామోహం తగ్గించుకుంటూ వుండాలి. పనికి రాని అలవాట్లు తగ్గించుకుంటూ వుండాలి. నేను అనే అహంకారం తగ్గించుకుంటూ వుండాలి. నాది అనే మమకారం తగ్గించుకుంటూ వుండాలి. కోరికలు తగ్గించుకుంటూ వుండాలి. అలా జీవితంలో ప్రతీది తగ్గించుకుంటూ వుండటమే తపస్సు అన్నారు.

అలా **"ప్రాపంచిక విషయాల పట్ల విరక్తి. ఆత్మ పట్ల ఆసక్తి పెరగాలి".** ఇదే ఆత్మ సాక్షాత్కారానికి మార్గమని బాబా చెప్పారు.

**లోనచూడటం :** అంటే ధ్యానం చెయ్యాలి. శ్వాస మీద ధ్యాస వుంచాలి. మొదట్లో కాళీ దొరికినపుడు తరువాత, తరువాత కాళీ చేసుకుని ధ్యానం ద్వారా లోన వున్న ఆత్మ మీద దృష్టి వుంచాలి.

**బ్రహ్మచారిగా వుండాలి :** బ్రహ్మచారిగా వుండాలి అంటే సంసారాన్ని వదిలెయ్యాలేమోనని అనుకుంటారు. అలా అనుకుంటూ ఇవన్నీ మనకు ఎలా సాధ్యమవుతాయి? మన వల్ల కాదులే! అది ఎవరో గొప్పవారికి, మహాత్ములకు, కారణ జన్ములకు, పూర్వ జన్మ సుకృతం వున్న వారికి మాత్రమే సాధ్యం కానీ మనబోటి సామాన్యులకు అవి ఎలా సాధ్యమవుతాయి? అన్నీ వదిలి ఇవన్నీ ఆచరించాలంటే చాలా కష్టం. ఏదో మన జీవితం ఏ లోటు లేకుండా వుంటే

చాలులే అనుకుంటూ వుంటారు.

కానీ బ్రహ్మచారి అంటే సంసారానికి దూరంగా వుండటం కాదు. బ్రహ్మంలో చరించే వాడు బ్రహ్మచారి. బ్రహ్మము అంటే భగవంతుడు. అంటే ఆత్మ. ఎప్పుడు ఏ పని చేసినా అందరూ ఆత్మ స్వరూపులే. అంతా ఒక్కటే అనే భావంతో చెయ్యాలి. సమస్తమూ దైవమే. అంతా దైవమయం. దైవం తప్ప వేరు ఏదీ లేదు అనే భావంతో జీవించడమే బ్రహ్మంలో చరించడం. అలాంటి వాడే బ్రహ్మచారి. ఇది కూడా ఆత్మ సాక్షాత్కారానికి ఒక మార్గం.

అందుకే బాబా వారు "సబ్ కా మాలిక్ ఏక్ హై" అని ఎక్కువగా అంటూ వుండేవారు.

**6) ప్రియమైన వాటి కంటే శ్రేయస్కరమైనవానిని కోరుట :-**

**"లోకములో రెండు తీరుల వస్తువులు వున్నవి. ఒకటి మంచిది, రెండవది ప్రీతి కరమైనది. మొదటిది వేదాంత విషయములకు సంబంధించినది. రెండవది ప్రాపంచిక విషయములకు సంబంధించినది. ఈ రెండును మానవుని చేరును. దీనిలో ఒక దానినే మానవుడు ఎంచుకోవాలి. తెలివిగల వాడు. మొదట దానిని అనగా శుభమైన దానిని కోరును. బుద్ధి తక్కువ వాడు రెండవ దానిని కోరును".**

వివరణ :- శాస్త్రాలలో కూడా మనకు రెండు మార్గాలు సూచించబడ్డాయి. (1) శ్రేయో మార్గము, (2) ప్రేయో మార్గము.

శ్రేయస్కరమైనది, కోరే వారు శ్రేయోమార్గాన్ని అనుసరిస్తారు. ప్రియమైనది కోరే వారు ప్రేయో మార్గాన్ని అనుసరిస్తారు.

శ్రేయస్కరము అంటే మనకు మంచి చేసేది అంటే ముక్తిని ఇచ్చేది. అంటే కష్టాలను దూరం చేసేది. దుఃఖాన్ని శాశ్వతంగా తొలగించేది శాశ్వతమైన బ్రహ్మానందాన్ని కలిగించేది.

ప్రియము అంటే ఇష్టమైనది. మనకు రకరకాల ఇష్టాలు వుంటాయి. ఆ ఇష్టాలు నెరవేర్చుకోవడానికి ప్రయత్నిస్తాం. సాధారణంగా అందరికీ ధనమంటే ఇష్టం. భోగ భాగ్యాలు అంటే ఇష్టం. సిరిసంపదలంటే ఇష్టం. మేడలు ఇష్టం. కార్లు ఇష్టం విలాసవంతమైన గృహోపకరణాలు ఇష్టం. అంతెందుకు అలాంటి జీవితమంటేనే ఇష్టం. ఇంకా పదవులు ఇష్టం. పెద్ద పెద్ద వుద్యోగాలు ఇష్టం. సంసారం ఇష్టం. పిల్లలంటే ఇష్టం. భార్య అన్నా, భర్త అన్నా ఇష్టం ఇలా చెప్పుకుంటూ పోతే ఎవరికైనా ఈ ప్రపంచంలో కనిపించేవి చాలా ఇష్టం. ఒక రకంగా ఈ ప్రాపంచికమైనవంటే చాలా చాలా ఇష్టం. అందరికీ ఇవే ప్రియమైనవి. అందుకే అందరూ ఈ ప్రేయో మార్గాన్నే

అనుసరిస్తున్నారు.

నిజంగా తెలివైన వారు ఎవరంటే "తనకు ఇష్టమైనది కోరేవారికంటే కష్టమైనా తనకు శాశ్వతంగా మంచి చేసేది కోరేవారు", ఎందుచేతనంటే మానవుడు తనకు ఇష్టమైనవి ఎన్ని సంపాదించుకున్నా, సమకూర్చుకున్నా దుఃఖంలోనే జీవిస్తున్నాడు. అశాంతికి లోనై వున్నాడు. సమస్యలతో సతమతమవుతున్నాడు. గమనిస్తే మానవులకు అన్నీ వున్నాయి. కానీ ఎవరికీ శాంతి లేదు. సరైన ఆరోగ్యం లేదు. కుటుంబంలో సరైన భాంధవ్యాలు లేవు. ఒకరికి ఇంకొకరికి సరైన అవగాహన లేదు. అంతా ఒక్కటే అయినా సమాజం లో కుల ఘర్షణలు, మత ఘర్షణలు, ప్రాంతీయ భేధాలు. ఎవరిని చూసినా సుఖాలు వున్నాయి కానీ పూర్తిగా అనుభవించలేక పోతున్నారు. శాంతిగా జీవించలేకపోతున్నారు.

దీనికంతటికీ కారణం ప్రతి ఒక్కరూ ప్రియమైనది కోరుకోవడమే. ప్రేయోమార్గాన్ని అనుసరించడమే. ఎవరికి వారు తమ ఇష్టం చూసుకుం టున్నారు కానీ ఎదుట వారి కష్టం పట్టించుకోవడం లేదు. చిన్న ఉదాహరణ చూద్దాం. ఎవరికి వారు తమకిష్టమైన మాంసాహారం తింటున్నారు. కానీ తాము ఆ పని చెయ్యడం వల్ల ఎన్ని జంతువులు హింసకు గురవుతున్నాయో! చంపబడుతున్నాయో! తమ కష్టం చెప్పుకోలేక మూగగా ఎలా రోదిస్తున్నాయో! మానవులు గుర్తించడం లేదు. ఎంతసేపూ తమ ఇష్టమే చూసుకుంటున్నారు.

అందుకే బాబా వారు స్పష్టంగా చెప్పారు **"తెలివి గల వాడు శుభమైన దానిని కోరతాడు. బుద్ధి తక్కువ వాడు. ప్రియమైన దానిని కోరతాడు"** అని. దీనిని బట్టి చూస్తే ఇష్టమైనది కోరేవాడు బుద్ధి తక్కువ వాడేనని మనం తెలుసుకోవచ్చు. అందుచేత మన ఇష్టాలను ప్రక్కన పెట్టి భగవంతునికి ఏది ఇష్టమో తెలుసుకోవాలి. కొంచెం ఆలోచించండి. ఎవరికి వారు తమకు నచ్చినట్టు చేస్తున్నారు కానీ, తాను చేసిన పని దేవుడు మెచ్చుతున్నాడా? లేదా? అని చూడటం లేదు. ఎంతసేపూ తన దృష్టిలో ఆలోచిస్తున్నాడు కానీ దేవుని దృష్టిలో ఆలోచించడం లేదు. తన దృష్టిలో తానే గొప్పవాడు. కానీ భగవంతుని దృష్టిలో సృష్టిలో వున్నవన్నీ గొప్పవే! అన్నీ ఆయనకు ఇష్టమైనవే. కారణం అన్నీ ఆయన సృష్టే కనుక.

అందుచేత అందరూ ఇష్టపడే ప్రాపంచిక మార్గం కంటే భగవంతుడు మెచ్చే ఆధ్యాత్మిక మార్గం అనుసరించాలి. వారే తెలివైన వారు. అదే మానవునకు శ్రేయస్సును కలిగించేది, దుఃఖాన్ని నివారించేది, ఆనందాన్ని కలిగించేది. ఆ మార్గమే ఆధ్యాత్మిక మార్గం, ఆత్మ మార్గం, అదే ధ్యాన మార్గం. ఎవరయితే

ధ్యానానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారో! ధ్యానం చెయ్యటానికి ఇష్టపడతారో! వారే తెలివైన వారు. వారే చివరకు ఆత్మ సాక్షాత్కారాన్ని పొంది ముక్తిని పొందగలుగుతారు.

**7) మనస్సును ఇంద్రియములను స్వాధీనము చేసుకొనుట :-**

**"శరీరము రథము, ఆత్మ దాని యజమాని. బుద్ధి ఆ రథమును నడుపు సారథి. మనస్సు కళ్ళెము. ఇంద్రియములు గుఱ్ఱములు. ఇంద్రియ విషయములు వాని మార్గములు. ఎవరికి గ్రహించు శక్తి లేదో! ఎవరి మనస్సు చంచలమైనదో, ఎవరి ఇంద్రియములు అస్వాధీనములో (బండి తోలు వాని దుర్మార్గపు గుఱ్ఱముల వలె) వాడు గమ్య స్థానమును చేరలేడు. చావు పుట్టుకల చక్రములో పడిపోతాడు".**

**"ఎవరికి గ్రహించు శక్తి కలదో! ఎవరి మనస్సు స్వాధీన మందుండునో! ఎవరి యింద్రియములు స్వాధీనమందుండునో! (బండినడుపు వాని మంచి గుఱ్ఱముల వలె) ఎవడు తన బుద్ధిని మార్గదర్శిగా గ్రహించి తన మనస్సును పగ్గముతో లాగి పట్టుకొనగలడో! వాడు తన గమ్య స్థానమును చేరగలడు. విష్ణు పదమును చేరగలడు".**

**వివరణ :-** ఇక్కడ గుఱ్ఱపు బండితో ప్రయాణించు వారి గమ్యము వేరు, అలాగే దేహమనే బండితో జీవిత ప్రయాణం సాగించు మానవుని గమ్యం వేరు, మానవుని గమ్యము విష్ణు పదము. ఆ గమ్యము చేరే వరకు మానవుడు చావు-పుట్టుకలు అనే చక్రంలో చిక్కుకుంటాడు. దానిలోనుంచి బయట పడలేడు. అలా చనిపోతూ... పుడుతూ... ఎంతో దుఃఖాన్ని అనుభవిస్తూ వుంటాడు. రోగాలతో బాధపడుతూ, సంపాదించుకున్నవన్నీ దూరమై పోతాయే మోనని భయపడుతూ, భార్యా పిల్లల గురించి, సంపదల గురించి ఆందోళన పడుతూ వుంటాడు. అలా జన్మించిన దగ్గర నుంచి మరణించే వరకు అంతా దుఃఖమే. యీతి బాధలు తప్పవు. అలాగే ఆది భౌతికము, ఆది ఆధ్యాత్మికము, ఆది దైవికమనే తాపత్రయాలు తప్పవు. ఎన్ని పుణ్యకార్యాలు చేసినా, ఎన్ని మంచి పనులు చేసినా ఎంతటి ధనవంతులైనా జన్మించిన ప్రతి ఒక్కరికీ ఈ నాలుగు రకాల దుఃఖాలు అంటే (1) జన్మ దుఃఖము, (2) జరా దుఃఖము, (3) వ్యాధి దుఃఖము, (4) మరణ దుఃఖము కూడా వుంటాయి.

అందుచేత ప్రతీ ఒక్కరూ వీటి నుంచి బయటపడే ప్రయత్నం చెయ్యాలి. లేకపోతే ఎంతమంది దేవుళ్ళను ఆశ్రయించినా, జీవితమంతా ఆరాధనలు చేసినా ప్రయోజనం లేదు. మరి వీటన్నిటి నుండి బయటపడాలంటే తప్పని సరిగా మానవ జీవిత గమ్యమైన విష్ణుపదం తప్పక పొందాల్సిందే. దానినే

ఆత్మ సాక్షాత్కారమని కూడా అంటారు.

దానిని సాధించటానికే బాబా వారు మనస్సును, ఇంద్రియాలను స్వాధీనంలో వుంచుకోవాలన్నారు. దుర్మార్గపు గుఱ్రాలు వుంటే తోలేవాడు గమ్యాన్ని ఎలా చేరలేడో! చంచలమనసస్సుతో ఇంద్రియాలు స్వాధీనములో లేని వాడు ఎప్పటికీ విష్ణు పదమనే గమ్యాన్ని చేరలేడు. అందుచేత మానవ జీవిత గమ్యం చేరాలంటే మనస్సు ఇంద్రియాలు మానవుని స్వాధీనంలో వుండాలి. వాటిని ఎలా స్వాధీనం చేసుకోవాలో చూద్దాం.

ఇంద్రియములు అంటే ఐదు జ్ఞానేంద్రియాలు (1) కన్ను, (2) ముక్కు, (3)చెవులు, (4) నాలుక, (5) చర్మము. ఐదు కర్మేంద్రియాలు (1) నోరు, (2) చేతులు, (3) కాళ్లు, (4) శిశ్నము, (5) గుదము. ఇవన్నీ మనస్సు ఆధీనంలో వుంటాయి. మనస్సు ఎలా చెపితే అలా పనిచేస్తాయి. అందుచేత ముందు మనస్సును మన స్వాధీనములో వుంచుకోవాలి. మనస్సును స్వాధీనంలో వుంచుకోవాలన్నా, మనస్సు యొక్క చంచల స్వభావం పోవాలన్నా ఏకైక మార్గం “శ్వాస మీద ధ్యాస ధ్యానం”. ధ్యానం ద్వారా ఇది మనం తేలికగా సాధించవచ్చు. మనస్సును మన ఆధీనంలో వుంచుకోవచ్చు.

మనస్సు చంచల స్థితిలో వుందా? లేదా? అన్నది తేలికగా తెలుసు కోవచ్చు. మీరు ఒక్కసారి కళ్ళు మూసుకుంటే వెంటనే ఎన్నో రకాల ఆలోచనలు వస్తాయి. కాసేపు గతానికి సంబంధించిన ఆలోచనలు కాసేపు భవిష్యత్తుకు సంబంధించిన ఆలోచనలు. అలా మనస్సు ఏదో ఒకటి ఆలోచిస్తూనే వుంటుంది. స్థిరంగా వుండదు. దీనినే చంచల స్వభావమంటారు. ఈ స్వభావాన్ని ధ్యానం ద్వారా తొలగించుకోవచ్చు.

ఎలా అంటే ధ్యానంలో కళ్ళు మూసుకుంటాం. అలా మూసుకోగానే ఆలోచనలు వస్తాయి. ఆలోచనలు రాగానే కంగారు పడకుండా ఆలోచనలు ఆపుచేసి మనస్సును శ్వాస మీదకు మళ్ళించాలి. అంటే గాలి బయటకు, లోపలకు పోయే విధానాన్ని మనస్సుతో గమనిస్తూ వుండాలి. మనస్సు కాసేపు గమనిస్తుంది. మళ్ళీ ఏదో ఒక ఆలోచనలోకి వెళ్తుంది. అయినా మనం మళ్ళీ మనస్సును శ్వాస మీదకు మళ్ళించాలి. ఇలా చెయ్యగా, చెయ్యగా, మెల్లిగా ఆలోచనలు తగ్గుతూ వుంటాయి. తగ్గి, తగ్గి మనకు తెలియకుండానే ఒక స్థితిలో ఆలోచనలన్నీ ఆగిపోతాయి. అలా ఆలోచనలన్నీ ఆగిపోయిన స్థితే ధ్యాన స్థితి. అదే మనస్సు శాంతించిన స్థితి. అదే మనస్సు చంచలతత్వం పోయిన స్థితి. అదే మనస్సు మీ అదుపులోకి వచ్చిన స్థితి.

అలాంటి ధ్యాన స్థితిలో గంటలు గంటలు కూర్చుంటే మీ మనస్సు

మీ అదుపులోకి పూర్తిగా వచ్చేస్తుంది. ఎప్పుడయితే మీ మనస్సు మీ అదుపులో వుంటుందో మీ ఇంద్రియాలు కూడా మీ అదుపులోకి వచ్చేస్తాయి.

కళ్ళు చూడమన్నవే చూస్తాయి. నోరు ఇచ్చిందే తీసుకుంటుంది. మాట అదుపులో వుంటుంది. చెవులు వినమన్నవే వింటాయి. ముక్కు చూడమన్న వాటినే వాసన చూస్తుంది. స్పర్శ కూడా అదుపులో వుంటుంది. ఒక్క భార్యతోటే సంతుష్టి పొందుతాడు. ఇతరులను చూసినా ఆకర్షితుడు కాడు.

అలాంటి స్థితి ధ్యానం ద్వారా సంపాదించినపుడు మంచి గుర్రాలతో రౌతు గమ్యాన్ని తేలికగా ఎలా చేరగలడో మానవుడు కూడా తన జీవిత గమ్యమైన విష్ణు పదాన్ని తేలికగా సాధించగలడని బాబా వారి సందేశం.

**8) మనస్సును పావనము చేయుట :-**

**"మానవుడు ప్రపంచంలో తన విధులను తృప్తిగా, ఫలాపేక్ష లేకుండా నిర్వర్తించని ఎడల అతని మనస్సు పావనము కాదు. మనస్సు పావనము కానిదే అతడు ఆత్మ సాక్షాత్కారము పొందలేడు. పావనమైన మనస్సులోనే వివేకము (అనగా సత్యమైన దానిని అసత్యమైన దానిని కనుగొనుట) వైరాగ్యము (అసత్యమైన దాని యందు అభిమానము లేకుండుట) మొలకలెత్తి క్రమముగా ఆత్మ సాక్షాత్కారమునకు దారితీయును. అహంకారము రాలిపోనిదే, లోభము నశించనిదే, మనస్సు కోరికలను విడిచి పెట్టనిదే ఆత్మ సాక్షాత్కారమునకు అవకాశము లేదు. దేహము 'నేను' అనుకొనుట గొప్ప భ్రమ. ఈ అభిప్రాయమందు అభిమానం ఉండుటయే బంధమునకు కారణము. నీవాత్మసాక్షాత్కారమును కాంక్షించినచో యీ అభిమానమును విడువవలెను".**

**వివరణ :-** బాబా సందేశం ప్రకారం ఆత్మ సాక్షాత్కారం పొందాలంటే ముందు మనస్సు పవిత్రం కావాలి. మనస్సు పవిత్రం కావాలంటే మానవుడు తన పనులు తృప్తిగా, ఫలాపేక్ష లేకుండా చెయ్యాలి. అంటే ఎవరైనా ఏ పని చేసినా ప్రతిఫలం ఆశించకుండా నిష్కామంగా చెయ్యాలి. అంటే ఏ పనైనా కోరికలు లేకుండా చెయ్యాలి. అంతేకాని నేను ఈ పూజ చేసాను, నాకు ఇది ప్రసాదించు. ఈ భజన చేశాను నా కష్టాలు తొలగించు, నేను హారతి ఇచ్చాను, నా రోగాలు నయం చెయ్యి. నైవేద్యం పెట్టాను. నా కోరికలు తీర్చు. హుండీలో డబ్బులు వేశాను, నా ధనాన్ని పెంచు. ఇవన్నీ ఫలాపేక్షతో చేసేవే. అలా చెయ్యడం వల్ల అనుకున్నది జరగకపోతే అసంతృప్తికి లోనవుతారు. ఇవన్నీ మనస్సును పావనం చెయ్యలేవని బాబా వారి సందేశం.

అందుచేత భగవంతుని మనం అడగవలసిన పని లేదు. **"చెయ్యవలసింది చేస్తే పొందవలసింది పొందుతాం". అని తెలుసుకుని "చెయ్యడానికి**

**ప్రాముఖ్యం ఇవ్వాలి. కోరడానికి కాదు".** అలా చెయ్యడం వల్ల మనస్సు కూడా పావనమవుతుంది. అంతేకాదు "సాత్వికమైన శాకాహారం మరియు ధ్యానం" ద్వారా కూడా తొందరగా మనస్సును శుద్ధి చేసుకోవచ్చు. అంటే పవిత్రం చేసుకోవచ్చు. అలా మనోశ్శుద్ధి జరిగినపుడు వారికి వివేకము, వైరాగ్యము ఏర్పడతాయి. దాని వల్ల ఏది నిత్యము? ఏది అనిత్యము? అంటే ఏది వుండేది? ఏది మాయ? ఏది సత్యం? ఏది అసత్యం? అన్నది తెలుసుకోగలు గుతారు. భగవంతుడు నిత్యమైన వాడు. ఈ కనిపించే ఈ ప్రపంచమంతా అనిత్యమైనదే అన్న విషయం బోధపడుతుంది. అపుడు ఈ ప్రాపంచిక విషయాలపై అంటే అసత్యమైన వాటి యందు అభిమానం తగ్గిపోతుంది. అంటే వైరాగ్యం ఏర్పడుతుంది. ఇవన్నీ ఆత్మ సాక్షాత్కారానికి దారి తీస్తుంది.

అంతేకాకుండా బాబా వారు ఇంకా ఏమి చెప్పారంటే నేను అనే అహంకారం పోవాలన్నారు, లోభము అంటే ఇవ్వకుండా దాచుకునే గుణం, వాటితో పాటు కోరికలు కూడా విడచిపెట్టాలన్నారు. వీటితో పాటు ముఖ్యంగా దేహమే నేను అనే అభిప్రాయం వుండకూడదన్నారు. దేహం మీద అభిమానం వదలాలన్నారు. కొంచెం గమనిస్తే ప్రతి ఒక్కరు దేహం నేను అనే భావంతోనే జీవి స్తున్నారు. ఎందుచేతనంటే ఎవరు ఏం చేసినా అంతా దేహం కోసమే! ఎంత సేపూ దేహ ఆరోగ్యం, దేహ అందం, దేహ సౌష్టవం, దేహ సుఖం, దేహ అలంకారం, దేహానికిచ్చే ఆహారం. ఇలా దేహం కోసం ఎంతో ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఈ రకంగా దేహాన్ని పోషించాలంటే ముఖ్యంగా ధనం కావాలి. అందుకోసం రోజులో ఎక్కువ సమయం ధన సంపాదనకే కేటాయిస్తున్నారు. అలా దేహ భావంతో దేహానికి ప్రాముఖ్యం ఇస్తూ, దేహం కోసమే జీవితమన్నట్టుగా, తాను దేహమన్నట్టుగా జీవిస్తున్నారు.

కానీ ఉన్న సత్యమేమిటంటే! మనమంతా ఆత్మలం అంతే కానీ దేహాలం కాదు. అందుచేత దేహాభిమానం వదలి ఆత్మాభిమానం పెంచుకోవాలి. దేహం గురించి ఆలోచించడం కాదు, ఆత్మ గురించి ఆలోచించాలి. దేహం గురించి అధ్యయనాలు కాదు, ఆత్మ గురించి అధ్యయనం చెయ్యాలి. దేహం గురించి సాధనలు కాదు, ఆత్మ గురించి సాధనలు చెయ్యాలి. అలా చేసినపుడే ఆత్మ సాక్షాత్కారం పొందగలుగుతాం.

దేహసాధనలు అందరికీ తెలిసినవే. వాకింగులు, జాగింగులు, ఎక్సర్‌సైజులు, ఆటలు, యోగాసనాలు, ప్రకృతి ఆహార నియమాలు లాంటివన్నీ దేహ సాధనలు. కానీ ధ్యానం ఒక్కటే ఆత్మ సాధన. ఆత్మను పొందటానికి

చేసే సాధన. అందుచేత ధ్యానం చేసే వారికి దేహాభిమానం తగ్గుతుంది. దేహాభిమానం తగ్గే కొద్దీ ఆత్మాభిమానం పెరుగుతుంది. అటువంటి వారు దేహసాధనలు వదిలిపెట్టి ఆత్మ సాధన అయిన ధ్యానానికి ప్రాముఖ్యం ఇస్తారు. చివరకు ఆత్మను సాక్షాత్కరించుకుంటారు.

**9) గురువు యొక్క ఆవశ్యకత :-**

**"ఆత్మజ్ఞానము మిక్కిలి సూక్ష్మము, గూఢమైనది. ఎవ్వరైనను తమ స్వశక్తిచే దానిని పొందుటకాశించలేరు. కనుక ఆత్మ సాక్షాత్కారము పొందిన యింకొకరి (గురువు) సహాయము మిక్కిలి అవసరము. గొప్ప కృషి చేసి, శ్రమించి ఇతరులు ఇవ్వలేని దానిని సులభముగా గురువు నుండి పొందవచ్చును. వారా మార్గమందు నడచి వున్నవారు కావున శిష్యుని సులభముగా ఆధ్యాత్మిక ప్రగతిలో క్రమముగా ఒక మెట్టు మీద నుంచి ఇంకొక మెట్టునకు తీసుకొని పోగలరు".**

బాబా వారు చెప్పిన ఈ విషయం కూడా చాలా ముఖ్యమైనది. ఎందుచేతనంటే ఆత్మ జ్ఞానము మిక్కిలి సూక్ష్మము. గూఢమైనదని బాబా వారు చెప్పడం జరిగింది. బాబా వారు చెప్పిన దానిని బట్టి చాలా సూక్ష్మాతి సూక్ష్మమైనదని తెలుసుకోము. అంటే ఆత్మను చూడలేము. మానవ ఇంద్రియాలతో తెలుసుకోలేడు. ఆత్మ కనబడదు. చెవులతో వినలేము. నోటితో చెప్పలేము. ముక్కు గ్రహించలేదు. చర్మం స్పృశించలేదు. అందుచేత ఆత్మను తెలుసుకోవడం, ఆత్మకు సంబంధించిన జ్ఞానం సంపాదించడం అంత తేలిక కాదని బాబా వారు చెప్పడం జరిగింది. అందుచేత అంత కష్టతరమైన ఆత్మను తెలుసుకోవాలంటే ఆ అనుభవం వున్న, అంటే ఆత్మానుభవం పొందిన వారి సహాయం, మార్గదర్శకం అవసరమని బాబా వారు చెప్పడం జరిగింది.

ఎందుచేతనంటే ఎవరైనా గురువు ఎంచుకోవడం పైనే వారి భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. పైకి వేషం చూస్తే అందరూ గురువులలాగే కనిపిస్తారు కానీ అసలైన గురువు ఎవరు? అన్నది వారి జ్ఞానాన్ని బట్టి మాత్రమే తెలుసు కోగలరు. ఇక్కడే శిష్యుడు వివేకం ఉపయోగించాలి. లేకపోతే ఇక్కట్లు తప్పవు.

చాలా మంది గురువులు శిష్యులకు నచ్చే విధంగా చెపుతారు. అలా చెప్పి శిష్యుల ద్వారా వారి లాభం చూసుకుంటారు, కానీ ఆత్మ జ్ఞానం పొందే మార్గం బోధించరు. అందుకే యోగి వేమన గారు ఇలా అన్నారు.

**కల్ల గురుడు కట్టు కర్మచయంబు**
**మధ్యముండు గట్టు మంత్రచయము**
**ఉత్తముండు గట్టు యోగసామ్రాజ్యము**
**విశ్వదాభిరామ వినురవేమ**

తా:- మోస గురువు పూజలు, భజనలు, అభిషేకాలు, యజ్ఞ యాగాది కర్మలు చేయిస్తాడు. మధ్యముడైన గురువు చెవిలో నామము, మంత్రము బోధించి జపాలు చేయిస్తాడు. కానీ ఉత్తమ గురువు ధ్యానాన్ని చేయించి యోగ సామ్రాజ్యమైన ఆత్మ సాక్షాత్కారాన్ని కలిగిస్తారని వేమన చెప్పారు.

అందుచేత ఉత్తమ గురువు గురించి కొంచెం తెలుసుకుందాం.

'గు' అంటే 'అజ్ఞానం' 'రు' అంటే 'జ్ఞానం'. అజ్ఞానాంధకారం పోగొట్టి జ్ఞానాన్ని ప్రసాదించే వాడు గురువు. గురువు జ్ఞాని అయి వుండాలి. జ్ఞానమంటే విషయ పరిజ్ఞానం. పాండిత్యం కాదు. గురువు స్వయం ప్రతిభ, స్వప్రజ్ఞ కలవాడై వుండాలి. గురువు బ్రహ్మానుభూతిని రుచి చూసినవాడై వుండాలి. తన శక్తితో శిష్యుల భవబంధాలు త్రెంచగలవాడై వుండాలి.

అంతేకాదు ఏ తాత్విక విషయాన్నైనా తడుముకోకుండా, ఆలోచించకుండా వివరించి చెప్పగలగాలి. ఆయనకు ఆ విషయాలు అంతకు ముందు తెలిసి వుండకపోవచ్చు. సందర్భానుసారంగా ఆయనకు స్ఫురిస్తాయి. అదే ప్రజ్ఞా విశేషం. సమస్త సంశయాలు సమూలంగా నిర్మూలించి మరణ భయం పోగొట్టి, సంసార బంధం నుండి బయట పడే మోక్ష మార్గాన్ని చూపించగలగాలి. అటువంటి వారినే సద్గురువులు అంటారు. లేదా పరమ గురువులు అంటారు.

సత్యమైన బ్రహ్మం మనస్సు దాటిన తరువాత మాత్రమే ద్యోతక మవుతుంది. మనస్సుతో దానిని తెలుసుకోలేం. బ్రహ్మం నిర్గుణం, నిరామయం, నిరంజనం. కనుక దానిని తెలుసుకోవటానికి జ్ఞానం చాలదు. ప్రజ్ఞ కావాలి. అది సద్గురువు వల్లే సాధ్యం. ఆయన అందించే సాధన వల్లే సాధ్యం.

సాధకుడు 'రూప ధ్యానం' వదలి 'అరూప స్థితి'కి చేరి, నిర్గుణోపాసన చేసి రూపాతీతమైన పరబ్రహ్మ తత్వం గ్రహించాలంటే! గురువు ఎంతగానో సహకరిస్తాడు. అందుకే సద్గురువును ఆశ్రయించాలి అని బాబా అన్నారు.

అందుచేత గురువును ఎన్నిక చేసుకునే ముందే శిష్యుడు జాగ్రత్త పడాలి. నేను గొప్పవాడిని, నేను శక్తివంతుణ్ణి. నేను అది ఇస్తాను, ఇది ఇస్తాను అని ఉత్తమ గురువు చెప్పడు. నీవు నాకు శిష్యుడు కమ్మని ఏ ఉత్తమ గురువు అర్థించడు. సాధకుడే గురువును ఎన్నుకోవాలి.

**10) భగవంతుని కటాక్షము :-**

**"ఇది అన్నిటి కంటే మిక్కిలి అవసరమై ఉన్నది. భగవంతుడు తన కృపకు పాత్రులైన వారికి వివేకమును, వైరాగ్యమును కలుగ చేసి సురక్షితముగా భవసాగరము నుండి తరింపచేయగలడు. వేదములను అభ్యసించుట వల్ల**

**గాని, మేధా శక్తి వల్ల గాని, పుస్తక జ్ఞానం వల్ల గాని ఆత్మానుభూతి పొందలేరు. ఆత్మ ఎవరిని వరించునో వారే దానిని పొందగలరు. అట్టి వారికే ఆత్మ తన స్వరూపమును తెలియచేయునని కఠోపనిషత్తు చెప్పుచున్నది".**

**వివరణ :-** బాబా వారు ముఖ్యంగా ఏమి చెప్పారంటే పండితులు చదివినట్టు వేదాలు చదివినా, పండితుల్లో పండితుడు అంటే వేదాలకు అర్థాలు చెప్పగలిగినటువంటి మేధా శక్తి వున్నవారు కానీ, పుస్తకాలు చూసి అనర్గళంగా ఉపన్యాసాలు చెప్పగలిగిన వారు కానీ, ఒక రకంగా పుస్తకాల ద్వారా భగవంతుని గురించి ఎంత తెలుసుకున్నా ఆత్మానుభూతి పొందలేరని బాబా చెప్పడం జరిగింది. ఆయన ఇంకా ఏమి చెప్పారంటే "ఆత్మ ఎవరిని వరించునో వారే ఆత్మను పొందగలరు" అంటే **"భగవంతుడు ఎవరిని ఇష్టపడతాడో వారే భగవంతుని పొందగలరు. అంటే ఎవరు భగవంతునికి ఇష్టమైనవారో వారే భగవంతుని చేరగలరు".**

భక్తులమనుకునేవారు ఈ విషయం చాలా జాగ్రత్తగా ఆలోచించాలి. ఎందుచేతనంటే చాలా మంది అంటూ వుంటారు. బాబా అంటే నాకు చాలా ఇష్టమని. కానీ బాబాకు తాము ఇష్టులయ్యారో? లేదో? ఆలోచించరు. కానీ ఇది చాలా ముఖ్యం. ఎందుచేతనంటే "వీరికి బాబా ఇష్టమైనంత మాత్రాన ప్రయోజనం లేదు, బాబాకు వీరు ఇష్టులవ్వాలి". అపుడే వారి జీవితం ధన్యమవుతుంది. వారే బాబా కృపకు పాత్రులవుతారు. అటువంటి వారికి వివేకము, వైరాగ్యము కలుగ చేసి సురక్షితంగా భవసాగరము నుండి అంటే ఈ దుఃఖాల నుండి తరింప చేయగలరు అంటే దాటించగలను అని చెప్పడం జరిగింది.

ఇంకా ఆలోచించండి. భక్తులు చాలా మంది వుంటారు. కానీ భగవంతునికి ఇష్టమైన వారే నిజమైన భక్తులు. అందుకే అంటారు. నేను బాబా భక్తుడను అని అనుకునే వారు గొప్పవారు కారు. వీడు నా భక్తుడు అని బాబా అనుకోవాలి. అటువంటి వారే గొప్పవారు. నిజమైన భక్తులు. మరి భగవంతుడు ఇష్టపడాలన్నా, భగవంతుని దృష్టిలో భక్తుడు కావాలన్నా ఏం చెయ్యాలి? ఏం చేస్తే భగవంతునికి ఇష్టులు కాగలం అన్నది తెలుసుకోవాలి.

ఈ విషమే 16-17 అధ్యాయాలలో 131వ పేజీలో బాబా చెప్పడం జరిగింది. **"నా ఖజానా నిండుగా నున్నది ఎవరికేది కావలసిన దానిని వారికి ఇవ్వగలను, కానీ వానికి పుచ్చుకొను యోగ్యత గలదా? లేదా? అని నేను మొదట పరీక్షించవలెను. నేను చెప్పిన దానిని జాగ్రత్తగా విన్నచో నీవు తప్పక మేలు పొందెదవు. ఈ మసీదులో కూర్చొని నేను ఎప్పుడూ అసత్యము**

**పలుకను".**

దీనిని బట్టి భగవంతుడు ఏదైనా ఇవ్వగలడు కానీ కోరిన వారికి కాదు. అల్పమైన కానుకలు సమర్పించిన వారికి కాదు. భగవంతుని నుంచి ఏది పొందాలన్నా యోగ్యత అంటే అర్హత అవసరం. యోగ్యత సంపాదించ కుండా ఎన్ని ఆరాధనలు చేసినా ప్రయోజనం లేదు. అందుచేత ఏది పొందాలన్నా బాబా చెప్పినట్టు దానికి కావలసిన యోగ్యత సంపాదించుకోవాలి. అది ముఖ్యం. ఆయనను ఆశ్రయించిన వారందరినీ ఆయన పరీక్షించుకుం టాడు. వాడికి ఆ అర్హత వుందా? లేదా? అని. అటువంటి వారే అవి పొందడా నికి అర్హులని, బాబా సందేశం ద్వారా మనం తెలుసుకోగలం. అందుచేత ప్రతీ ఒక్కరూ తాను కోరుకున్నది పొందాలంటే ఎలాంటి అర్హత సంపాదించాలో తెలుసుకోవాలి. మరొక్కసారి తెలుసుకోండి. **"కోరడం ముఖ్యం కాదు. అర్హత ముఖ్యం".** అలాగే ఆత్మసాక్షాత్కారానికి కూడా భగవంతుని కృప అవసరం. ఆ కృప ఎవరికి కలుగుతుందంటే భగవంతునికి ఇష్టులైన వారికి మాత్రమే. మరి భగవంతునికి ఎవరు ఇష్టులు? అంటే భగవద్గీతలో శ్రీ కృష్ణ భగవానుడు చెప్పిన ఈ క్రింది శ్లోకాలు చూద్దాం.

**శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోర్జున**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. (భ.గీ 7-16)**

**శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే**
**ప్రియో హి జ్ఞానినోత్యర్థమహం స చ మమ ప్రియ: (భ.గీ 7-17)**

తా:- భరతవంశ శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఆపదలలో ఆర్తనాదాలు చేసేవారు, ధనాన్ని ఆశించేవారు, భగవంతుని తెలుసుకోవాలనే ఆసక్తి కలవారు, ఆత్మజ్ఞానము కలవారు అనే నాలుగు విధాలైన వారు నన్ను సేవిస్తున్నారు. వారిలో 'జ్ఞాని' శ్రేష్టుడు. అట్టి 'జ్ఞానికి' నేనూ ఇష్టుడనే. అతడు కూడా నాకు ఎక్కువ ఇష్టుడే.

పై శ్లోకాలను బట్టి నాలుగు రకాల భక్తులలో అంటే కష్టాలు తొలగించ మని పూజలు, భజనలు, ప్రార్థనలు చేస్తూ ఆర్తనాదాలు చేసే 'ఆర్తులు' కంటే! అలాంటివే చేస్తూ ధనాన్ని, సంపదల్ని ప్రసాదించమని కోరే 'అర్థార్థుల' కంటే, భగవంతుని తెలుసుకోవాలనే జిజ్ఞాసతో శాస్త్రాలను అధ్యయనం చేసే 'పండితుల' కంటే కూడా, 'ధ్యానం' ద్వారా ఆత్మజ్ఞానం సంపాదించుకోవాలను కునే 'జ్ఞానే' నాకు ఇష్టుడు అని భగవానుడు చెప్పడం జరిగింది. అంటే అందరి భక్తుల కంటే ధ్యానం చేసేవాడే నాకు ఇష్టుడని స్పష్టంగా శ్రీ కృష్ణ భగవానుడు చెప్పారు.

పై సందేశాన్ని బట్టి భగవంతునికి, 'ఆత్మ జ్ఞానులే' ఇష్టులవుతారని మనం తెలుసుకోవచ్చు. అందుచేత జ్ఞానం సంపాదించుకోవడానికి ప్రయత్నించాలి. మరి జ్ఞానమన్నది ధ్యానం వల్ల మాత్రమే వస్తుంది. వేరొక మార్గం లేదు. అందుకే బాబా వారు కూడా నవ విధ భక్తులలో 9వది అయిన "ఆత్మ నివేదనే" నాకు ఇష్టము అన్నారు.

అలా బ్రహ్మ జ్ఞానం పొందడానికి కావలసిన విషయాలన్నీ బ్రహ్మ జ్ఞానము ప్రసాదించమని కోరిన ఒక ధనిక భక్తుని ఉద్దేసించి అక్కడ వున్న వారందరికి బాబా చెప్పడం జరిగింది. ఇవన్నీ విపులంగా ఆ ధనిక భక్తునికి చెప్పి వాటి సారాంశము వానికి మరల (130 పేజీ) ఈ విధంగా బాబా చెప్పారు. **"నీ పేరాసను, లోభమును పూర్తిగా వదలనంత వరకు నీవు నిజమైన బ్రహ్మమును చూడలేవు. ఎవరి మనస్సు ధనమందు, సంతానము నందు, ఐశ్వర్యమునందు లగ్నమై వున్నదో! వాడా అభిమానము పోగొట్టుకోనంత వరకు బ్రహ్మమునెట్లు పొందగలడు?"**

**"అభిమానమనే భ్రమ, ధనమందు దృష్టి (కోరిక) దుఃఖమను సుడిగుండము వంటిది. అది అసూయ, అహంభావమను మొసళ్ళతో నిండియున్నది. ఎవడు కోరికలు లేనివాడో వాడు మాత్రమే ఈ సుడిగుండము దాటగలడు. 'పేరాశ-బ్రహ్మ జ్ఞానము ఉత్తర, దక్షిణ ధృవములు వంటివి. అవి శాశ్వతముగా ఒకటికొకటి బద్ధవైరము గలవి".**

బాబా ఇంకా ఇలా చెప్పారు. (పేజీ131) **"ఎక్కడ పేరాశ గలదో అక్కడ బ్రహ్మము గురించి ఆలోచించుటకు గాని, దాని ధ్యానమునకు గాని తావులేదు. (ధ్యానం చెయ్యలేడు) అట్లయినచో పేరాస గల వాడు విరక్తిని మోక్షమును ఎట్లు సంపాదించగలడు? లోభికి సంతుష్టి గాని, ధృఢ నిశ్చయముగాని వుండవు. మనస్సు నందు ఏ మాత్రం పేరాశ వున్నా సాధనలన్నీ అంటే ఆధ్యాత్మిక ప్రయత్నములన్ని నిష్ప్రయోజనము"** అని చెప్పారు.

బాబా ఇంకా ఇలా చెప్పారు. **"ఎవడు ఫలాపేక్ష రహితుడు కాడో! ఎవడు ఫలాపేక్ష కాంక్షను విడువడో! ఎవనికి వాని యందు విరక్తి లేదో! అట్టి వాడు గొప్ప చదువరి (బాగా చదువుకున్న వాడైనా, పండితుడైనా) అయినప్పటికీ వాని జ్ఞానము పనికి రానిది. ఆత్మ సాక్షాత్కారము పొందుటకు అది వానికి సహాయపడదు".**

బాబా ఇంకా ఇలా చెప్పారు. **"ఎవరు అహంకార పూరితులో, ఎవరు ఇంద్రియ విషయములు గురించి ఎల్లపుడు చింతించెదరో, వారికి గురుబోధలు నిష్ప్రయోజనములు (పనికిరావు) అందుచేత** మనస్సు పవిత్రమొనర్చుట

**తప్పనిసరి అవసరము".**

అలా బాబా ఆత్మ సాక్షాత్కారానికి బోధించిన విషయాలు సూక్ష్మంగా మరియొకసారి వివరించి మనస్సును పవిత్రమొనర్చుకొమ్మన్నారు. మరి మనస్సును పవిత్రం చేసుకునే ఏకైక మార్గం ధ్యానం. అంటే 'శ్వాస మీద ధ్యాస'. అందుచేత ఎవరైతే ధ్యానం చేస్తారో వారు బాబా చెప్పినట్టు జీవించ గలుగుతారు. చెప్పినవన్నీ సాధించగలుగుతారు. ముఖ్యంగా ఆత్మ సాక్షాత్కారా నికి ధ్యానం అత్యంత అవసరమని బాబా చెప్పడం జరిగింది. (18-19 అధ్యాయాలలో 143 పేజీలో) బాబా చెప్పిన విషయం ఒకసారి చూద్దాం :-

**"ఆత్మ సాక్షాత్కారమునకు ధ్యానమవసరము. దానిని అలవరచు కున్నచో (ప్రతీరోజు ధ్యానం చెయ్యడం అలవాటు చేసుకుంటే) వృత్తులన్నియు శాంతించును, కోరికలన్నీ విడిచి, నిష్కామివై, నీవు సమస్త జీవరాసి యందు గల భగవంతుని ధ్యానింపుము. మనస్సు ఏకాగ్రమైనచో లక్ష్యం నెరవేరును. సదా నా నిరాకార స్వభావమును ధ్యానింపుము. అదియే జ్ఞాన స్వరూపము, చైతన్యము, ఆనందము".**

పై సందేశాన్ని బట్టి బాబా సమస్త జీవుల యందు వున్న భగవంతుని అంటే ఆత్మను ధ్యానించమన్నారు. అంతే కాదు ఈ ధ్యానాన్ని ఏ కోరికలు లేకుండా, అంటే ప్రతిఫలం ఆశించకుండా చెయ్యమన్నారు. అలా చేస్తే లక్ష్యం నెరవేరుతుందని చెప్పారు. ఆయన ఇంకా తన నిరాకార స్వభావం అంటే ఆత్మను ధ్యానించ మన్నారు. అలా ఆత్మను ధ్యానించే మార్గమే "శ్వాస మీద ధ్యాస". ఆయన ఇంకా ఏమన్నారంటే **"మీరిది చేయలేనిచో రాత్రింబవళ్ళు మీరు చూచుచున్న నా యీ ఆకారమును ధ్యానించుడు. అట్లు కొన్నాళ్ళు చేయగా మీ వృత్తులు కేంద్రీకృతమగును".**

బాబా నిరాకార స్వభావాన్ని ధ్యానించడం తెలియని వారు, మొదట్లో ఆయన సాకార రూపాన్ని ధ్యానించమ న్నారు. అది కూడా కొద్ది రోజులు మాత్రమే. అలా చేస్తూ మెల్లగా బాబా నిరాకార స్వభావం అంటే ఆత్మను ధ్యా నించాలి. బాబా ఇంకా ఏమన్నారంటే అలా చేస్తే **"ధ్యాత (ధ్యానం చేసేవాడు), ధ్యానము, ధ్యేయము (ఆత్మ) ఈ మూడింటికి గల భేధము పోయి ధ్యా నించు వాడు చైతన్యము(ఆత్మ)తో ఐక్య మై బ్రహ్మముతో అభిన్నమవుతారు".** అంటే బాబాలో ఐక్యమవుతారు అంటే ఆత్మసాక్షాత్కారము పొందుతారు అని అర్థం. ఇదే విషయం 43-44 అధ్యా యంలో 323 పేజీలో కూడా బాబా చెప్పడం జరిగింది.

**"ఎవరైతే సర్వశ్య శరణాగతి చేసి నన్నే ధ్యానింతురో వారికి నేను**

ఋణగ్రస్థుడను. వారికి మోక్షమునిచ్చి వారి ఋణము తీర్చుకొనెదను. ఎవరయితే నన్నే చింతించుచు నా గూర్చియే దీక్షతో నుందురో, ఎవరైతే నాకర్పించనిదే (అంటే ఏ జీవికైనా) తినరో అట్టి వారిపై నేను ఆధారపడి యుందును. ఎవరైతే నా సన్నిధానము నకు (దేహంలో వున్న ఆత్మ వద్దకు) వచ్చెదరో వారు నది సముద్రములో కలిసిపోయినట్లు నాలో కలిసిపోవుదురు. కనుక నీవు సర్వము, అహంకార ము లేశమైనా లేకుండా నీ హృదయము లోనున్న నన్ను సర్వశ్య శరణాగతి వేడవలెను".

"నేననగా నెవరు?" నేను అనగా ఎవ్వరో సాయిబాబా ఎన్నో సార్లు బోధించిరి. వారిట్లనిరి. "నన్ను వెదకుటకు నీవు దూరము గాని మరెచ్చటికి గాని పోనక్కర్లేదు. నీ నామము, నీ ఆకారము విడిచినచో నీలోనే గాక అన్ని జీవులలోను చైతన్యము లేదా అంతరాత్మ అని ఒకటి వుండును. "అదే నేను" దీనిని నీవు గ్రహించి నీలోనే గాక అన్నిటిలోను నన్ను చూడుము. దీనిని నీవు అభ్యసించినచో సర్వవ్యాపకత్వ మనుభవించి నాలో ఐక్యము పొందెదవు".




నిరాకార స్వభావమైన ఆత్మను ధ్యానించాలనుకునేవారు 'శ్వాస మీద ధ్యాస' వుంచితే తేలికగా ఆలోచనలు తగ్గించుకోగలుగుతారు. మనస్సును శూన్యం చేసుకోగలుగుతారు. మనస్సుకు అతీతమైన ఆత్మ స్థితికి చేరుకుంటారు.

అందుచేత ప్రతీ ఒక్కరూ ధ్యానం చెయ్యండి. బాబా గుళ్ళలో వున్న ధ్యాన మందిరాలు ఉపయోగించుకోండి. ఎక్కువ సమయం బాబా (ఆత్మ) మీద దృష్టి వుంచండి. దుఃఖం నుంచి తాత్కాలికంగానే కాదు శాశ్వతంగా బయటపడండి.

మరొక్కసారి గుర్తుంచుకోండి

**"బాబా ఎక్కడ నేను అని చెప్పినా వెంటనే ఆత్మ అని తెలుసుకోవాలి".**



# ఈశావాశ్యోపనిషత్!
## - బాబా వివరణ!

ఈశావాశ్య ఉపనిషత్‌లోని ఒక వాక్యానికి అర్థం సరిగ్గా అర్థం కాక శిష్యులు క్రిందా, మీదా పడుతుంటే! షిరిడీ బాబా వారు అద్భు తంగా దానికి వివరణ ఇచ్చారు. అది ఒకసారి చూద్దాం.

**శ్లో॥ "ఈశావాశ్యమిదం సత్యం యత్కించిత జగత్యాం జగత్"**

తా:- అఖిల బ్రహ్మాండంలోని జడ, చైతన్య స్వరూపాలన్నీ ఈశ్వరునిచే వ్యాపించి వున్నాయి.

అంటే మొత్తం ఈ సృష్టిలోని జడ అంటే కదలిక లేని, చైతన్యం అంటే కదలిక కలిగిన రూపాలన్నీ ఆ పరబ్రహ్మచే వ్యాపించబడి వున్నాయని బాబా వారు అర్థం చెప్పారు.

దీనినే భగవద్గీతలో

**శ్లో॥ మయాతత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।**
**మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః (భ.గీ.9-4)**

తా:- నేను నా అవ్యక్తరూపంతో ఈ జగత్తు అంతా వ్యాపించి వున్నాను. సమస్త ప్రాణి కోట్లు నాయందు వున్నవి. నాకవి ఆధారములు కావు.

బాబా ఇంకా ఏమన్నారంటే ఈ ఉపనిషత్తులోని శాంతి మంత్రం ఈ విషయమే బోధిస్తుంది. అదే విషయాన్ని శ్రీ కృష్ణుల వారు భగవద్గీతలో కూడా చెప్పడం జరిగిందని చెప్పారు.

**శ్లో॥ ఓమ్ పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణముదచ్యతే!**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వషిష్యతే!!**

తా:- ఈ పరబ్రహ్మ పూర్ణమే, ఈ జగత్తు కూడా పూర్ణమే. పూర్ణ పరబ్రహ్మ నుంచే ఈ పూర్ణ జగత్తు ఉత్పన్నమైంది. కనుక పూర్ణ పరబ్రహ్మ నుంచి పూర్ణ జగత్తు యొక్క కల్పన తీసివేసినా పూర్ణ పరబ్రహ్మమే మిగిలి వుంటుంది అని చెపుతూ ఆయన ఇలా వివరించారు.

వీటి అర్థం అన్నీ బ్రహ్మమే. అన్నిటిలో వున్నది బ్రహ్మమే. కాబట్టి నేను, నాది అన్న భావన పూర్తిగా విస్మరించాలి. దేనిపైనా అభిమానాన్ని

పెంచుకోకూడదు; అని బాబా వారు చెపుతూ అంతా పరబ్రహ్మదే కాబట్టి ఎవరికి ఏది లభించినా! ఉన్నా! అది ఈశ్వరుని నుంచి లభించిందని తెలుసు కోవాలి.

అందుచేత ఈశ్వరుని నుంచి లభించే ఐశ్వర్యాన్ని త్యాగ పూర్వకంగా అనుభవించాలి, పంచాలి. ఏ రకమైన లోభాన్ని, మోహాన్ని పెట్టుకోకూడదు అని షిరిడీ బాబా వివరణ ఇచ్చారు. అలా చెపుతూ ఆయన ఈశావాశ్య ఉపనిషత్‌లోని ఈ క్రింది శ్లోకం చెప్పారు.

**"తేనత్యక్తేన భుంజథామాగ్రుధఃకస్యస్విద్ ధనం" (ఓ 81-97)**

అలాగే భగవద్గీతలోని ఈ క్రింది శ్లోకం కూడా వివరించారు.

**శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి సపశ్యతి (భ.గీ.13-28)**

తా:- పరమేశ్వరుడు అన్ని ప్రాణుల అంతఃకరణలో ఒకేలా వున్నాడు. ఆ ప్రాణుల దేహాదులు నశించినను, నశింపని వానివిగా ఎవడు చూచుచున్నాడో అతడే నిజముగా చూచువాడగును.

దీనిని బట్టి మానవుడు తనకు లభించిన దానితో సంతుష్టి చెందాలి. ఈ సృష్టి నుంచి ఎవరికి ఏది లభించినా అది అందరిచే అందరి కోసమని అర్థం చేసుకోవాలి. అందరికీ పంచాలి. దాచుకోకూడదు అని బాబా వారి సందేశం. కానీ లోకంలో మానవులు ఉన్న దానిని పంచకుండా, దాచుకోవడమే కాదు, దోచుకుంటూ కూడా ఇంకా, ఇంకా ఇవ్వమని బాబాను ప్రార్థిస్తున్నారు. భజనలు చేస్తున్నారు. అంటే బాబా వారు చెప్పేది ఒకటి, భక్తులు చేసేది ఇంకొకటి. అందుకే అందరి జీవితాలు అలా వున్నాయి. అందుచేత ఎవరైనా లాభపడాలంటే బాబా వారి సందేశం అర్థం చేసుకుని దానికి అనుగుణంగా ప్రవర్తించాలి. ఈ సృష్టిలోని వారంతా ఒక్కటే! అన్నీ ఒక్కటే! అన్నీ పరబ్రహ్మ స్వరూపాలని తెలుసుకోవాలి. ఆఖరికి జంతువులు కూడా! అందుచేత జీవహింస చేయకూడదు. మాంసాన్ని భక్షించకూడదు. కోరకూడదు! ఉన్న దానితో తృప్తి చెందాలి! పంచాలి!

అలా చేస్తేనే బాబా చెప్పింది అర్థం చేసుకున్నట్టు. ఆయనంటే ఇష్టపడే వారు ఆయన చెప్పినట్టు నడుచుకోవాలి. అలాంటి వారే ఆయనకు ఇష్టులవుతారు.



# "సబ్‌కా మాలిక్ ఏక్ హై"

షిరిడి బాబా వారు ఈ వాక్యాన్ని పదే పదే చెపుతూ వుంటారు. మహానుభావులు ఏ విషయాన్ని చెప్పినా దానిలో చాలా అర్థం వుంటుంది. అంతరార్థం వుంటుంది. గొప్పదాన్ని చిన్న వాక్యంలో చెపుతారు. విశేషమైన దాన్ని సూక్ష్మంగా చెపుతారు. అలా వారు సూక్ష్మంగా చెప్పిన దాని విశేష అర్థం తెలుసుకుని ఆచరించేవారు ధన్యులు.

"సబ్ కా మాలిక్ ఏక్ హై" అంటే "అంతటికీ అంటే అందరికీ, అన్నిటికీ యజమాని ఒక్కడే!". అంటే "అఖిల బ్రహ్మాండంలోని జడ, చైతన్య స్వరూపాలన్నీ అంటే ఈ సృష్టిలోని చర, అచరాలన్నిటికీ యజమాని ఒక్కడే!" అని అర్థం.

సహజంగా యజమాని అని ఎవరిని అంటాం? ఎవరైనా ఏదైనా నిర్మించుకున్నా, సృష్టించుకున్నా దానికి వారిని యజమాని అంటాం. అలా ఎవరైనా ఒక ఇల్లు నిర్మించుకుంటే దానికి వారు యజమాని అవుతారు. అంతా ఏమంటారంటే ఆ యింటి యజమాని వాడు రా! అంటారు. అలాగే ఎవరైనా ఒక వ్యాపార సంస్థను స్థాపించుకుంటే దానికి వాడిని యజమాని అంటాం. అలాగే ఒక ఇండస్ట్రీని స్థాపించుకున్నా, ఒక ఎస్టేటు ఏర్పాటు చేసుకున్నా, వాటిని నిర్మించుకున్న వారిని యజమాని అంటారు. అలాగే ఎవరైనా ఒక రాజ్యాన్ని ఏర్పాటు చేసుకుంటే ఆ రాజ్యానికి వారు యజమాని అవుతారు. వారిని రాజు అని కూడా అంటారు.

అలా ఎవరు ఏది సృష్టించుకున్నా అంటే నిర్మించుకున్నా ఏర్పాటు చేసుకున్నా, స్థాపించుకున్నా వాటన్నిటికీ వారు యజమాని అవుతారు.

అలాగే అఖిలాండ బ్రహ్మాండమైన, అనంతమైన ఈ సృష్టిని నిర్మించినది, సృష్టించినది ఒక్కడే. అంటే వీటన్నిటికి యజమాని ఒక్కడే అని తెలుసుకోవాలి.

కారణం ఈ సృష్టిలో కొన్నిటిని చాలా మంది కలిసి నిర్మిస్తారు.

కొన్నింటిని ఎంతోమంది కలిసి సృష్టిస్తారు. అంటే ఒకదానికి ఎంతోమంది యజమానులుంటారు. కానీ ఈ సమస్త సృష్టికి 'యజమాని' ఒక్కడే! 'మాలిక్' ఒక్కడే! అని షిరిడీ బాబా చెప్పారు.

అఖిలాండ బ్రహ్మాండమైన ఈ సృష్టిని సృష్టి చేసిన యజమానిని అందరూ వివిధ రకాలుగా పిలుస్తారు. ముస్లింలు 'అల్లా' అని, క్రిష్టియన్లు 'తండ్రి' అని, హిందువులు 'భగవంతుడు' అని, 'సృష్టి కర్త' అని, 'పరబ్రహ్మ', 'పరమాత్మ', 'ఈశ్వరుడు', 'విశ్వాత్మ', 'ఆదిశక్తి' అని ఇలా రకరకాలుగా పిలుస్తారు. ఏది ఏమైనా బాబా చెప్పినట్టు ఈ సృష్టి మొత్తానికి యజమాని ఒక్కడే. ఇది ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. అర్థం చేసుకోవాలి. గుర్తుంచుకోవాలి.

అంటే ఈ సృష్టిలో కంటికి కనిపించేవి, కనిపించనివి వున్నాయి. అవి ఏవైనా సరే అన్నిటికీ యజమాని భగవంతుడే. అంటే కనిపించే లోకాలు, కనిపించని లోకాలు, 84 లక్షల రకాలు జీవులు, జీవరాసులు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ సృష్టిలో ఏది సృష్టింపబడినా! ఏది లయమవుతున్నా! అన్నిటికీ యజమాని భగవంతుడే.

ఆయనే ఈ సృష్టిలో గొప్పవాడు. అసలు వున్నదే ఆయన. ఆయన నుంచే అన్నీ సృష్టింపబడ్డాయి. ఆఖరుకు అందరూ అనుకునే దేవుళ్ళు కూడా ఆయన నుంచి వచ్చినవారే! అంటే అందరికీ ఆయనే యజమాని, తండ్రి కూడా. అందుకే జీసస్ నా తండ్రి రాజ్యం అని అంటారు. ఒక రకంగా చూస్తే వేరే ఏదీ లేదు. అందుచేత ప్రతి ఒక్కరి ధర్మమేమిటంటే ఈ సత్యాన్ని తెలుసుకోవాలి, అర్థం చేసుకోవాలి. అలాంటి వారికి అంతా ఆనందమే. అంతా శాంతే.

కారణం 'నేను' అనేది లేదు కనుక 'నేను' వుంటేనే ఏదైనా వుంటుంది. 'నేను' లేనపుడు ఇక ఏమి వుంటుంది?

అంతా దైవమే, అంతా బ్రహ్మమే. అంతా భగవంతుడే. అదే ముక్త స్థితి. ఈ విషయాన్నే షిరిడీ బాబా తెలుసుకోమంటున్నారు. ఆ మార్గమే "శ్వాసమీద ధ్యాస ధ్యానం". ధ్యానం ద్వారా ఎవరైనా "సబ్‌కా మాలిక్ ఏక్‌హై" అన్నది అర్థం చేసుకోగలుగుతారు.



# పేరి ప్రశ్న? బాబా వివరణ

చాలా మంది ప్రశ్నలు వేస్తుంటారు. అలా ప్రశ్నలు వేయడానికి చాలా కారణాలు వుంటాయి. కొంతమంది వూరికే ప్రశ్నలు వేస్తూ వుంటారు. ఇంకా కొంతమంది ఎదుట వారి తప్పులు పట్టడానికి, వారిలోని లోపాలు చూపించడానికి ప్రశ్నలు వేస్తూ వుంటారు. ఇంకా కొంతమంది పదిమందిలో గొప్ప అనిపించుకోవడానికి ప్రశ్నలు వేస్తూ వుంటారు. ఇంకా కొంతమంది నాకు అన్నీ తెలుసు అని తెలియచెప్పటానికి ప్రశ్నిస్తూ వుంటారు. ఇంకా కొంతమంది దుర్బుద్ధితో గాని, దొంగ ఎత్తుతో ఎదుట వారిని బుట్టలో వేయటానికి, వారికి ఏమీ తెలియదని నిరూపించటానికి, పది మందిలో వారిని తక్కువ చేయటానికి, ప్రశ్నలు వేస్తూ వుంటారు. కొంతమంది ఎదుట వారిని పరీక్షించడానికి ప్రశ్నలు వేస్తూంటారు.

అంతే కానీ తెలుసుకోవడానికి కాదు. అలాగే అదే ప్రశ్న వచ్చిన వారినందరిని అడుగుతూ వుంటారు. నిజంగా సందేహమవుతే అంతమందిని అదే ప్రశ్న అడగవలసిన పనేమిటి?

అలాగే కొంతమంది ప్రశ్నలడిగి వారు ఏదైనా సమాధానం చెపితే అది కాదు అని వారితో వాదనకు దిగుతారు. నిజంగా తెలియనిది తెలుసుకోవాలనుకునే వారు వాదించరు. వాదనకు దిగరు. చెప్పిన సమాధానంతో వూరుకుంటారు. నువ్వు చెప్పింది తప్పు అన్నాడంటే దాని సమాధానం నీకు తెలియదు అని అన్నట్టేగా? పైగా కాదు అన్నాడంటే దాని సమాధానం తనకు తెలిసినట్టేగా? లేకపోతే కాదు అని ఎలా అనగలడు? అంటే ఎదుట వారిని పరీక్షించడానికేగా? వాడు ఎలా చెపుతాడో అని చూడటానికేగా? అంతే కాని నిజంగా సందేహం కాదు. తెలుసుకోవటానికి కాదు. తెలియంది కాదు.

ఇలాంటి వారు వేసే ప్రశ్నలకు జ్ఞానులు, జ్ఞానమున్న వారు సమాధానం చెప్పరు. చెప్పడానికి ప్రయత్నించరు. కారణం అనవసరపు వాదనలకు వారు దిగరు. వారు మూర్ఖులతో వాదించరు. వారు అడిగే ప్రశ్నను బట్టే వారు అర్థం చేసుకుంటారు. దాన్ని బట్టే వారి ప్రవర్తన, సమాధానం వుంటుంది.

అలాగే కొంతమంది వినడం మీద ఆశక్తి చూపించరు. అడగడం

మీదే ఆసక్తి కనబరుస్తారు. చెప్పే వారిని చెప్పనివ్వరు. ఇంకా సందర్భం కాని ప్రశ్నలు, ఇచ్చే సందేశానికి విరుద్ధమైన ప్రశ్నలు వేస్తూ వుంటారు. ఇంకా కొంతమంది ప్రశ్నలు వేస్తూ గందరగోళం సృష్టిస్తారు. అసలు సభనే సజావుగా సాగనివ్వరు. ఇంకా కొంతమంది ప్రసంగాన్ని పూర్తికానివ్వరు. పూర్తిగా వినరు. మధ్యలోనే ప్రశ్నిస్తారు. అసలు ప్రసంగం పూర్తిగా వింటే ఆ ప్రశ్నకి, ఆ ప్రసంగం లోనే సమాధానం దొరుకుతుంది. అలాగే కొంతమంది ప్రసంగించేటపుడు వేరే దృష్టిలో వుంటారు. సరిగా వినరు. ఇంకా కొతమంది మధ్యలో వస్తారు. అలా చేస్తూ చెప్పిన విషయాల గురించే ప్రశ్నలు వేస్తూ వుంటారు.

ఇంకా కొంతమంది ఎక్కడో ఏదో వింటారు. ఇక్కడ వీరు చెపుతుంటే చెప్పిన దాని గురించి విశ్లేషణ చేసుకోరు. ఆలోచించరు. కానీ అక్కడ ఆయన అలా ఎందుకు చెప్పాడు? అని అడుగుతారు. ఇంకా కొంతమంది మీరు చెప్పింది కరెక్టే, కానీ ఆయన అలా ఎందుకు చెప్పాడు? అని ప్రశ్నిస్తారు. కానీ అలా ఎందుకు చెప్పావు? అని చెప్పిన వారిని ప్రశ్నించడు.

ఇలా చెప్పుకుంటూ పోతే ప్రశ్నించే వారిలో రకరకాల వారు వుంటారు. రకరకాల ఉద్దేశ్యాలతో ప్రశ్నించేవారు వుంటారు.

కానీ ఎలా ప్రశ్నించాలి? ఎలాంటి ప్రశ్నలు వేయాలి? ఏ సందర్భంలో వేయాలి? ప్రశ్నలు వేసేటపుడు ఎదుట వారిని ఎంత గౌరవంతో చూడాలి? అన్నది ఆలోచించరు. నిజంగా చెప్పేది నచ్చకపోయినా! తప్పని అనిపిస్తున్నా వివేకవంతుడయితే వినడు, విమర్శించడు. అక్కడ కూర్చోడు. మెల్లిగా అక్కడ నుంచి నిష్క్రమిస్తాడు.

కారణం చెప్పే వారందరూ ఒకే స్థాయిలో వుండరు. ఒకే రకమైన జ్ఞానం కలిగి వుండరు అన్నది వివేకవంతులకు తెలుసు. ఎవరి స్థాయిలో, ఎవరి స్థాయికి తగ్గట్టు, ఎవరికి ఎంత తెలుసో అంతే చెపుతారని వివేకవంతుడు అంటే బుద్ధి వున్నవాడు అర్థం చేసుకుంటాడు. అందుకే వాదనలకు దిగరు. వాదించరు. బుద్ధి వున్నవాడు నచ్చితే వింటాడు. నచ్చకపోతే నిష్క్రమిస్తాడు. అవసరమనుకుంటే నచ్చినది మాత్రమే తీసుకుంటాడు. మిగిలినదంతా వదిలివేస్తాడు. ఏదీ నచ్చకపోతే పూర్తిగా చెప్పినదంతా అక్కడే వదలేస్తాడు. మరచిపోతాడు. కారణం ఈ లోకంలో ఎప్పుడూ! ఎవరూ! ఒకే రకంగా చెప్పరు. తనకు కావలసిందే చెప్పరు. తనకు నచ్చినట్టే చెప్పరు. కారణం

అందరి జ్ఞానం ఒకే స్థాయిలో వుండదు కాబట్టి. అందుచేత ప్రశ్నలు వేసేటపుడు ఎవరైనా పై విషయాలన్నీ దృష్టిలో వుంచుకోవాలి.

అలాగే ఒక సందర్భంలో ఒక శిష్యునికి షిరిడీ బాబా వారు ఎలా ప్రశ్నించాలి? ఏ సందర్భంలో ప్రశ్నించాలి? ఏ విషయాల గురించి ప్రశ్నించాలి? అన్న దాని గురించి వివరంగా చెప్పడం జరిగింది. దానినే 39వ అధ్యాయంలో 293 - 294 పేజీలలో వివరించడం జరిగింది.

ఒకరోజు బాబా శిష్యుడైన నానా సాహేబు చాందోర్కర్‌కు ఈ విషయమై చక్కని వివరణ ఇవ్వడం జరిగింది. నానా భగవద్గీతలో ఒక శ్లోకం గురించి అడుగగా బాబా చాలా చక్కగా దానిని వివరించారు.

శ్లో॥ **తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః (భ.గీ.4-34)**

తా:- (ఓ అర్జునా) అట్టి జ్ఞానమును నీవు తత్వ వేత్తలగు జ్ఞానులకు (మోక్షమును పొందు జ్ఞానము గల వారు అనగా పరబ్రహ్మామును తెలిసిన వారికి) సాష్టాంగ నమస్కారము చేసి, సమయము చూసి వినయముగ ప్రశ్నించి, సేవ చేసి, వారి వలన ఎరుంగుము. వారు తప్పక ఉపదేశించగలరు.

షిరిడీ బాబా పై తాత్పర్యానికి గల అంతరార్ధము నానా సాహేబ్‌కు ఈ విధంగా వివరించారు.

1) జ్ఞానుల ముందు ఉత్త సాష్టాంగ నమస్కారము చేసినచో సరిపోదు. సద్గురువునకు సర్వస్య శరణాగతి చేయవలెను.

2) ఊరికే ప్రశ్నిస్తే చాలదు. దుర్బుద్ధితో గానీ, దొంగ ఎత్తుతో కానీ, వారిని బుట్టలో వేయుటకు గాని, వారి తప్పులను పట్టుటకు గాని, పనికి మాలిన యాసక్తితో గానీ అడుగకూడదు. మోక్షమును పొందుటకు గాని, ఆధ్యాత్మికాభివృద్ధికి గాని, నిజముగా తెలుసుకొనుటకు అడగవలెను.

3) సేవ యనగా ఇష్టమున్నచో చేయవచ్చును. లేనిచో మానవచ్చుననే అభిప్రాయముతో చేసేది సేవ కాదు. శరీరము తనది కాదని, ధనానికి తాను యజమాని కాదని, శరీరము గురువు గారిదని, వారి సేవ కొరకే శరీరమున్నదని భావింపవలెను. అట్లు చేసినపుడు సద్గురువు జ్ఞానాన్ని బోధిస్తాడు.

అలాగే బాబా జ్ఞానమంటే ఏమిటి? దాన్ని ఎలా బోధించాలో కూడా తెలియచేశారు.

**"అజ్ఞానాన్ని నశింపచేయడమే జ్ఞానమని"** చెప్పారు. **"చీకటిని తరుముటయే వెలుతురు". "ద్వైతమును నశింపచేయుటయే అద్వైతము. ద్వైతాన్ని నశింపచేయడమంటే అద్వైతాన్ని బోధించడం చీకటిని తరమడమంటే వెలుతురు గూర్చి చెప్పడం".**

అద్వైతాన్ని పొందాలంటే ద్వైతమనే భావాన్ని మనసులో నుంచి తీసివేయాలి. అదే అద్వైతాన్ని పొందే జ్ఞానము.

సద్గురువు నిర్గుణుడు, సచ్చిదానందుడు. ఆయన మానవ ఆకారమున అవతరించుట జగత్తును మానవాళిని ఉద్ధరించడానికే. అలా మానవ రూపం ధరించడం వల్ల ఆయన నిర్గుణ స్వభావము కొంచెం కూడా వికారము చెందదు. ఆయన సత్య స్వరూపము, దైవిక శక్తి, జ్ఞానము తరుగదు. శిష్యుడు కూడా అలాంటి వాడే కానీ అతని అనేక జన్మలు అజ్ఞానం వల్ల తానే శుద్ధ చైతన్యము (దైవము) అన్న సంగతి కప్పి వేస్తుంది. శిష్యుడు "నేను సామాన్య నికృష్ట జీవుడను" అని అనుకుంటాడు.

గురువు ఈ అజ్ఞానాన్ని మూలముతో తీసివేయాలి. దానికి తగిన ఉపదేశము ఇవ్వాలి. శిష్యుడు లెక్కలేనన్ని జన్మల నుంచి సంపాదించిన అజ్ఞానాన్ని గురువు నిర్మూలించి ఉపదేశించాలి.

**"ఎన్నో జన్మల నుంచి తాను నికృష్ట జీవుడననుకునే శిష్యునికి గురువు "నీవే దైవము, శక్తియుతుడవు, ఐశ్వర్యశాలివి" అని బోధించాలి. అపుడు శిష్యుడు కొంచెము, కొంచెముగా తానే దైవమని గ్రహిస్తాడని"** షిరిడీ బాబా నానాసాహేబుకు చెప్పారు.

ఆయన ఇంకా ఈ విధంగా చెప్పారు. **"శిష్యుడు తాను శరీరమని, తానొక జీవినని, ఈ లోకము, దేవుడు తనకంటే వేరని తలంచడం అనేక జన్మల నుండి వస్తూన్న దోషమే కానీ వేరు కాదు. అలా భావిస్తూ చేసిన కర్మల వలన వానికి సంతోషము, విచారము. ఈ రెండింటి యొక్క మిశ్రమము కలుగునని బాబా చెప్పడం జరిగింది".**

శిష్యుడు ఈ భ్రమను, ఈ దోషాన్ని ఈ మూల అజ్ఞానాన్ని గురించి విచారించడం ప్రారంభించాలన్నారు. **"అసలు ఈ అజ్ఞానము ఎట్లు అంకురించింది? అది ఎక్కడ వుంది? అను దానిని చూపడమే గురూపదేశం అంటారు.** అని బాబా చెపుతూ ఈ క్రింద వివరించినవన్నీ అజ్ఞాన లక్షణాలని

చెప్పారు.

1) నేను జీవిని (ప్రాణిని)

2) నేను శరీరమును.

3) భగవంతుడు, ప్రపంచము, జీవుడు వేర్వేరు.

4) నేను దేవుడను కాను.

5) శరీరము ఆత్మ కాదని తెలుసుకోకపోవడం.

6) దేవుడు, జీవుడు, ప్రపంచము అన్నీ ఒక్కటే అని తెలియకపోవడం.

ఈ తప్పులన్నీ చూపించకపోతే శిష్యునకు దేవుడంటే ఏమిటి? ప్రపంచమంటే ఏమిటి? శరీరమంటే ఏమిటి? అన్న విషయాలు తెలుసుకోలేడు. వాటిలో వాటికి ఎలాంటి సంబంధం వుందో? అసలు ఒకటి, ఇంకొకటి కంటే తేడా లేదా? లేక రెండూ ఒకటేనా? అన్న సంగతి గ్రహించలేడు. ఈ సంగతులన్నీ బోధించి వారి అజ్ఞానాన్ని నశింపచేయటానికి చెప్పేదంతా జ్ఞానమవుతుందా? అజ్ఞానమవుతుందా? అసలు జీవుడు జ్ఞానమూర్తి అవుతే జ్ఞానోపదేశము చేయవలసిన అవసరం వుండదు కదా? అని చెప్తూ బాబా వారు **"ఉపదేశమంటే వాని తప్పును వానికి చూపి అజ్ఞానాన్ని నశింపచేయడమే"** అని చెప్పారు.

ఆయన ఇంకా ప్రణి పాతమనగా శరణాగతి అని, అంటే శరీరము, మనస్సు, ధనములను అర్పించడమని కూడా చెప్పారు.

అలా అజ్ఞానాన్ని తొలగించుకోవడానికి, జ్ఞానాన్ని పొందడానికి అంతటి సమర్థులైన గురువులను ఆసక్తితో సమయము చూసి, సందర్భాను సారంగా ప్రశ్నించాలని షిరిడీ బాబా నానాసాహేబుకు వివరించారు.

**యోగులంతా చెప్పిందీ ధ్యానమే - చేసిందీ ధ్యానమే**



**ధ్యానం అంటే శ్వాస మీద ధ్యాస**

# ఇష్టమైన దేవుని బాధించవచ్చా?

చాలా మందికి షిరిడీ సాయిబాబా అంటే చాలా ఇష్టం. కారణం ఆయన కోరికలు తీర్చే వాడని, తమ కష్టాలు, బాధలు తొలగిస్తాడని వారి నమ్మకం. ఆయనను ఆరాధిస్తే, పూజిస్తే, ఆశ్రయిస్తే వారి కష్టాలు తొలగుతాయని వారి విశ్వాసం. అందుకే ఆయనంటే వారు చాలా ఇష్టపడతారు.

అంతేకాదు ఆయన మహత్యాలు, లీలలు ఎన్నో చెప్పుకుంటారు. ఆయన జీవించి వున్నపుడు భక్తులను ఆదుకున్న విషయాలు, కష్టాల నుంచి కాపాడిన సంఘటనలు కథలుగా చెప్పుకుంటారు. అందుచేత ఆయనను ఆశ్రయిస్తే తమను కూడా అలాగే కాపాడతాడని, రక్షిస్తాడని వారి నమ్మకం.

అలాంటి విషయాలు కొన్ని బాబా సత్ చరిత్రలో చెప్పడం జరిగింది. అందులో ఆయన భక్తుడొకడు తీవ్రమైన జబ్బుతో, విపరీతమైన దగ్గుతో బాధపడుతూ వుంటాడు. ఆ భక్తుడు ఈ బాధ నుంచి కాపాడమని బాబాని వేడుకుంటాడు, ప్రార్థిస్తాడు. అప్పుడు బాబా కరుణించి ఆ భక్తుని మొర ఆల కించి అతని జబ్బును, దగ్గును తగ్గిస్తాడు. కానీ అదే సమయంలో అదే బాధను బాబా అనుభవిస్తూ వుంటారు. అంటే బాబా ఆ భక్తుని రోగాన్ని తాను తీసుకుని ఆ బాధ తాను అనుభవిస్తూ భక్తుని బాధ తగ్గించారు. ఇక్కడ భక్తుడు ఆనందపరవశుడయ్యాడు. కానీ ఆ బాధ బాబా అనుభవించవలసి వచ్చింది.

ఇక్కడ మనం కొంచెం ఆలోచిస్తే ఈ సృష్టిలో ఒకరి కష్టం పోగొట్టా లంటే ఇంకొకరు దానిని అనుభవించవలసిందేనని అర్థమవుతుంది. అంటే దేవుడైనా ఆ బాధను తాను తీసుకుంటే తప్ప భక్తునికి తగ్గించలేడని అర్థమవుతుంది.

ఇక్కడే భక్తులు ఆలోచించాలి. తన బాధ తొలగించమని దేవుని ప్రార్థిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. అంటే ఒకరకంగా ఆ బాధ నువ్వు తీసుకో అని కోరడమేగా? ఇది భక్తునికి ఎంత వరకు సమంజసం? తన భాధ పోగొట్టుకోవడం కోసం తనకిష్టమైన దేవుని ఆ బాధ అనుభవించమనడం సమంజసమా? తాను తనకిష్టమైన దేవుని బాధించవచ్చా? తాను అనుభవించ లేనిది దేవుని అనుభవించమనడం ఎంతవరకు న్యాయం? తనకిష్టమైన దేవుని బాధించడం, కష్టపెట్టడమేనా తాను చేసేది? తాను కోరేది?

నిజమైన భక్తుడు దేవుని ఆనందపరచాలని చూస్తాడు కానీ. ఆయనను బాధించే పనులు చేయడు. దేవుని బాధించేవాడు భక్తుడెలా అవుతాడు? నిజమైన భక్తుడు. తానైనా బాధ అనుభవిస్తాడు కానీ, నా బాధ తీసుకుని నువ్వు బాధపడు అని కోరడు. అందుచేత ఆలోచించండి! మీకు ఇష్టమైన దేవుని బాధించవచ్చా?

ఇది చెపితే మరి మేమిప్పుడు ఏం చెయ్యాలి? మా బాధ ఎలా పోతుంది? అని అడగవచ్చు. కానీ ఆలోచించండి. **బాధ ఎలా పోతుందని అడుగుతున్నారు కానీ అసలు ఆ బాధ ఎలా వచ్చిందని ఆలోచించరేం?** ముందు దీని గురించి ఆలోచించాలి. అసలు ఆ బాధే జీవితంలో రాకపోతే! బాధ తొలగించమని కోరనవసరం లేదు కదా! ఇష్టమైన దేవుని బాధకు గురి చేయవలసిన పని లేదు కదా?

మరి బాధ ఎందుకు వచ్చింది? అది మనం గతంలో చేసిన పాపం వల్లనే వచ్చింది. గతంలో పాప కర్మలు చేసాం. ఎవరినో బాధించాం. అది ఇప్పుడు అనుభవిస్తున్నాం.

అందుకే శాస్త్రాలు చెబుతున్నాయి. **"పూర్వ జన్మ కృతం పాపం వ్యాధి రూపేణ పీడ్యతే!"** అని.

మరి ఆలోచించండి పాపాలే చెయ్యకపోతే బాధలే వుండవు కదా? అపుడు ఇష్టమైన దేవుడిని తన బాధ తీసుకోమనవలసిన అవసరం రాదు కదా? ఆయనను బాధించవలసిన పని వుండదు కదా? దీనిని బట్టి ఇష్టమైన దేవుని బాధించకూడదంటే! తాను పాపాలు చెయ్యకూడదు. అంటే ఎవరినీ బాధించకూడదు, హింసించకూడదు.

అందుచేత అసలు పాపమంటే ఏమిటి? ఏం చేస్తే పాపం? అన్న విషయాలు తెలుసుకోవాలి. ఈ సృష్టిలో ఏ జీవికి అంటే మానవులకైనా, జంతువులకైనా మన వల్ల కష్టం, నష్టం, బాధ కలిగిస్తే దానిని పాపం అంటారు. దానినే హింస అని కూడా అంటారు. అంటే హింస చేయడమే పాపం. అలా తాను చేసిన హింసే తన రోగమవుతుంది. మరి హింస చేయడమెందుకు? హింస అనుభవించడమెందుకు?

అందుకే "అడుసు తొక్కనేల కాళ్ళు కడగనేల" అంటారు. అంటే అడుసు తొక్కడమెందుకు? కాళ్ళు కడుక్కోవడమెందుకు? పాపం చెయ్యడమెందుకు? బాధ తొలగించమని ప్రార్థించడమెందుకు? ఆలోచించండి. మనకు ఇష్టమైన దేవుళ్ళను బాధించకండి. వారు మాకు ఇష్టమైన వారు అంటూ కష్టపెట్టడం మన ధర్మం కాదు.

అసలు వేటినీ కష్టపెట్టకపోతే మనకు కష్టాలే రావు కదా! అందుచేత జీవహింస చేయకండి. మాంసభక్షణ మానండి. అందరినీ ప్రేమించండి. దేవునికి అందరూ సమానం, అన్నీ ఆయన రూపాలే. ఆయన బిడ్డలే. ఎవరిని హింసించినా ఆయనను హింసించినట్టేనని తెలుసుకోండి. మీ బాధ మీకు ఎలాంటిదో వాటి బాధ కూడా వాటికి అలాంటిదేనని తెలుసుకోండి! మీ బాధ మీరు అనుభవించలేనపుడు అవి అనుభవించగలవా? మీరు మీకు ఇష్టమైన దేవుని ప్రార్థిస్తున్నపుడు, వాటికి కష్టమొచ్చినపుడు అవి ఆయనను ప్రార్థించవా? వాటికి కూడా ఆయనే దైవం కదా?

ఇంకా ఆలోచించండి. ఒకవేళ బాబానే కనుక మీ బాధను తీసుకున్నాడే అనుకోండి. కనీసం ఇప్పటినుంచైనా ఎవరినీ బాధించకుండా వుంటారా? పాపాలు చెయ్యకుండా వుంటారా? జంతువులను చంపకుండా వుంటారా? మాంసభక్షణ మానేస్తారా? మానరు కదా! అసలు హింస మానకుండా బాధను తొలగించమనే హక్కు మనకెక్కడిది? అలా హింస చేస్తూ బాధలు తెచ్చుకుంటుంటే! బాబా తొలగిస్తూ తాను అనుభవిస్తూ వుంటాడా? ఇదేనా బాబా పని? అసలు ఎంతమంది బాధలు బాబా అనుభవించగలడు? మన ఒక్కరి బాధే మనం అనుభవించలేక ప్రార్థిస్తున్నామే! మరి ఇంతమంది ఇన్ని వేల మంది, ఇన్ని లక్షల మంది బాధలు బాబా అనుభవించగలడా? అందరివి ఆయన తీసుకుంటే ఆయన పరిస్థితి ఏమిటి? ఏదో ఒకరి బాధ భరించగలడు గానీ అందరి బాధా ఎలా భరించగలడు?

ఇంకా ఆలోచించండి ఆయన జీవించి వున్నపుడు అంటే శరీరంతో వున్నపుడు భక్తుని శరీర బాధ తన శరీరంతో అనుభవించాడు. కానీ ప్రస్తుతం బాబాకు శరీరం లేదుగా? ఎలా తీసుకుంటాడు? ఎలా అనుభవిస్తాడు? అది సాధ్యమా? ఆ అవకాశం బాబాకు ఇప్పుడు లేదు కదా? అందుచేత ఎవరి బాధలు వారు అనుభవించవలసిందే. బాబా వున్నాడు మా బాధలు పోగొడతాడు ఫర్వాలేదు అనుకుంటూ హింస చేస్తూ, పాపాలు చేసుకుంటూ పోతే తప్పనిసరిగా భాధలు అనుభవించవలసి వస్తుంది. జీవితం దుర్భరమవుతుంది. అందుచేత హింస చేయకండి. పాపాలు మానండి.

ఆలోచించండి. **"బాధించడమెందుకు? భాధలు తీసుకోమని ప్రార్థించడ మెందుకు? ఇతరుల శరీరాన్ని బాధించడమెందుకు? నీ శరీరానికి బాధ తెచ్చుకోవడమెందుకు?" బాధించక పోతే బాధే వుండదు కదా!** అందుచేత ఆలోచించండి. హింస మానండి. ఇష్టమైన దేవుళ్ళను బాధించే పని చెయ్యకండి. ఇది ఒక్క బాబాకే కాదు అందరి దేవుళ్ళకు వర్తిస్తుంది. అందరికీ వర్తిస్తుంది.

తెలుసుకోండి. గతంలో మనం తెలుసో, తెలియకో పాపాలు చేసాం. అది అనుభవిస్తున్నాం. ఆ బాధలు భరించలేక బాధలు తీసుకొమ్మని దేవుళ్ళను ప్రార్థిస్తున్నాం. అలా ప్రార్థించడం కాదు. పాపకర్మలు పోయే మార్గం తెలుసుకోవాలి. ఆ సాధన చెయ్యాలి. ఆ సాధనే 'ధ్యానం'. ధ్యానం చేస్తే మన పాపాలు, మనమే తొలగించుకోగలుగుతాం. అంటే 'మనల్ని మనం ఉద్ధరించుకుంటాం' ఇదే కదా భగవత్ గీతా సందేశం "ఉద్ధరేదాత్మనాత్మానం". అందుచేత "హింస మానండి అంటే మాంస భక్షణ మానండి. ధ్యానం చెయ్యండి". మనకు ఇష్టమైన వారు చెప్పింది చెయ్యండి. వారిని ఆదర్శంగా తీసుకోండి. వారి మార్గంలో నడవండి. అంతేకానీ ఇష్టమైన దేవుళ్ళను బాధించకండి. కష్టపెట్టకండి.

# "ఇవ్వని వాడికి అడిగే హక్కు లేదు"

చాలా మంది గుడికో, మందిరానికో, చర్చికో, మసీదుకో వెళ్ళి తమకిష్టమైన దేవుణ్ణి తమకు కావలసినవి కోరుకుంటారు. ప్రార్థిస్తారు. కానీ వారు అంతకన్నా ఆలోచించరు.

ఎందుచేతనంటే వారు అలా కోరుకుంటారు కానీ వారు కోరుకునేది ఏదీ ఇతరులకు, లోకానికి ఇవ్వరు. గమనిస్తే ఆనందం కోరుకుంటారు. కానీ ఎంతమందికి ఆనందం కలిగిస్తున్నారు? ఆనందంగా జీవించనిస్తున్నారు? శాంతిని కోరుకుంటారు, అంటే స్వామీ, తండ్రీ నాకు మనశ్శాంతిని కలిగించు, శాంతిగా జీవించేటట్టు చెయ్యి ప్రభువా అని ప్రార్థిస్తారు. కానీ తాము లోకంలో ఎంతమందిని శాంతిగా జీవించనిస్తున్నారో ఆలోచించరు. అసలు ఎంతమందిని శాంతిగా జీవించనిస్తున్నారు? దొడ్లో కోడిని శాంతిగా తిరగనిస్తున్నారా? చెరువులో చేపను శాంతిగా ఈదనిస్తున్నారా? మేకను తన పిల్లా పాపాలతో శాంతిగా జీవించనిస్తున్నారా? ఇవన్నీ ఆలోచించకుండా దేవుని మాత్రం శాంతిని ప్రసాదించమని కోరుకుంటారు.

అంతేకాదు దయ చూపమని పై వాడిని కోరుకుంటారు. కానీ తన క్రింది వారి మీద, తన క్రింది జీవుల మీద దయ చూపించరు. కరుణించు తండ్రీ అంటారు. కానీ తన క్రింది వారి మీద కరుణ చూపించరు. అనుగ్రహించు తండ్రీ అంటారు. కానీ వీరు ఎవరిని అనుగ్రహించారు? ఎంతమంది వీరి అనుగ్రహం పొందారు? అని ఆలోచించరు.

అలాగే ధనం కోరుకుంటారు. కానీ తనకు ఇవ్వబడిన ధనంలో ఎంత శాతం లోకానికి, ఇతరులకు ఇచ్చారు? ఇలా ఆలోచించుకుంటూ పోతే ప్రతీ ఒక్కరూ దేవుణ్ణి కోరుకునేవారే కానీ అంతా దేవుని బిడ్డలంటూ ఆ దేవుని బిడ్డలైన ఇతరుల గురించి ఆలోచించరు. దేవునికి తనతో పాటు వారు కూడా సమానమని తెలుసుకోరు. తన తోటి వారందరికీ అంటే మానవులకు, జంతువులకు కనీసం పొరుగున వున్న వారికైనా తాను ఏదైతే కోరుకుంటున్నారో అవి ఇవ్వడానికి ప్రయత్నించరు.

మరి ఆలోచించండి అలా ఇవ్వని వాడికి అడిగే హక్కు ఎక్కడిది? అందుచేత అడిగే ముందు నేను ఇస్తున్నానా? ఇచ్చానా? అని ఆలోచించాలి. కారణం ఇవ్వడమే మానవ ధర్మం. 'సృష్టి ధర్మం'. దీనినే 'దాన ధర్మం' అంటారు. అంతే కాదు భగవంతుని లోకంలో ఇచ్చేవాడు అడగవలసిన అవసరం కూడా లేదు. కారణం అడిగితేనే ఇస్తాడనుకోవడం మూర్ఖత్వం. అజ్ఞానం. **"భగవంతుని లోకంలో ఇస్తే చాలు అడగనవసరం లేకుండా వస్తుంది. ఇవ్వకపోతే కోరినా రాదు".** ఇది చాలా చాలా ముఖ్యమైన ధర్మం. అందుచేత ఇవ్వడం నేర్చుకోండి. కోరడం కాదు.

అంతేకాదు "ఈ సృష్టిలో ఏది ఇస్తే అదే వస్తుంది. ఎంత ఇస్తే అంతే వస్తుంది" అని తెలుసుకుని నీకు ఏది కావాలో అది ఇవ్వటానికి ప్రయత్నించాలి. నీకు 'ఆనందం' కావాలంటే అందరికీ ఆనందం కలిగించే పనులు చెయ్యాలి. నువ్వు 'శాంతి'గా జీవించాలంటే అందరినీ, అన్ని జీవులను 'శాంతి'గా జీవించనివ్వు. ధనం కావాలంటే ధనం పంచు. గౌరవం కావాలంటే అందరినీ గౌరవించు. 'దయ' కావాలంటే అందరిమీ 'దయ' చూపించు.

అలాగే హింస వద్దనుకుంటే! ఏ జీవిని, ఏ జంతువును హింసించకు, చంపకు, వాటి మాంసాన్ని భక్షించకు. అవమానం వద్దనుకుంటే! ఎవరినీ అవమానించకు. నష్టం వద్దనుకుంటే! ఎవరినీ నష్టపరచకు, కష్టం వద్దనుకుంటే! ఎవరినీ కష్టపెట్టకు. నీవి అపహరించబడకూడదనుకుంటే నీవు ఎవరివి అపహరించకు. అంటే నీవు ఏది వద్దనుకుంటావో అవి ఇవ్వకు. ఏది కావాలనుకుంటే అది ఇవ్వు. ఇదే సృష్టి ధర్మం. అందుచేత తెలుసుకోండి. ఈ సృష్టిలో **"ఇవ్వని వాడికి అడిగే హక్కు లేదు. ఇచ్చేవాడు అడగవలసిన పని లేదు".**



# ధ్యానం చేసే పద్ధతి
# శ్వాసమీద ధ్యాస



ఎవరికి తగిన సుఖాసనంలో వారు హాయిగా కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనిస్తూ వుండాలి!

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు 'కట్' చేస్తూ... మళ్ళీ, మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే.. క్రమ క్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది.... చిత్తవృత్తులు నిరోధించబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది. మనస్సు శాంతిస్తుంది. ఇదే ధ్యాన స్థితి.

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీ మండల, ఆత్మానుభవాలను గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో విశ్వమయ ప్రాణశక్తి. అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీ మండలాన్ని శుద్ధి చేస్తుంది. ఆ శక్తి వల్ల రోగాలన్నీ తగ్గుతాయి. నాడీమండల శుద్ధి వల్ల కర్మలు పోతాయి.

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు... తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా... ధ్యానం చెయ్యాలి.

# నవవిధ భక్తులు

భగవంతుని ఆరాధించడానికి, అలాగే ముక్తి పొందటానికి తొమ్మిది రకాల భక్తులున్నాయని చాలా మంది భావిస్తూ వుంటారు. అందుచేత ఏదో ఒక మార్గం ద్వారా భగవంతుని ఆరాధించవచ్చని భావిస్తూ ఈ తొమ్మిదిలో ఏది చేసినా సరిపోతుందనుకుంటారు.

కానీ నవవిధ భక్తులు అంటే "తొమ్మిది రకాలు కాదు. తొమ్మిది రకాలుగా ఆరాధించాలి". ఈ తొమ్మిదీ ఆచరించిన వాడే తొందరగా భగవంతుని చేరగలడు. ముక్తిని పొందగలడు.

ముందు నవ విధ భక్తులు ఏమిటో చూద్దాం.

(1) శ్రవణము, (2) కీర్తనము, (3) స్మరణము, (4) పాదసేవనము, (5)అర్చనము, (6) నమస్కారము, (7) దాస్యము, (8) సఖ్యము, (9) ఆత్మ నివేదనము

ఎవరైనా మోక్షం తొందరగా పొందాలంటే ఈ తొమ్మిది అవసరమే. కొంచెం వివరంగా తెలుసుకుందాం.

**1) శ్రవణము (వినడం) :–** ప్రారంభంలో ఎవరికైనా భగవంతుని గూర్చి తెలియదు కాబట్టి ముందు భగవంతుని గూర్చి తెలుసుకోవాలి. అంటే ఆ విషయాలు ఎవరైనా చెపుతున్నప్పుడు వినాలి. అలా వింటూంటే మెల్లిగా భగవంతుడనేవాడు ఉన్నాడని, అవగాహన కలుగుతుంది. అలా భగవంతుని గురించిన అవగాహన కోసమే శ్రవణము.

భగవంతుడు వున్నాడని తెలుసుకున్నంత మాత్రాన ముక్తి లభించదు కదా? ముక్తి లభించాలంటే మనం చెయ్యవలసినవి ఇంకా వున్నాయి. అవేమిటో తెలుసుకుందాం.

**2) కీర్తనము :–** అంటే కీర్తించడం. అంటే భగవంతుని పొగడడం. అంటే ఆయన గొప్పతనాన్ని, ఆయన విశిష్ఠతని, ఆయన శక్తిని, కీర్తనల ద్వారా, స్తోత్రాల ద్వారా, పారాయణ ద్వారా తెలుసుకోవడం. ఉదాహరణకు విష్ణు సహస్ర నామ స్తోత్రం. లలితా సహస్ర నామ స్తోత్రం అంటే భగవంతుని గొప్పతనాన్ని వెయ్యి రకాలుగా, వెయ్యి నామాలతో వర్ణించడం, ఇలా కీర్తించడం వల్ల, పారాయణ చెయ్యడం వల్ల ఆయన గొప్పవాడన్న సంగతి తెలుస్తుంది. కానీ, ఆయన్ను చేరడానికి ముక్తిని పొందటానికి ఇది కూడా సరిపోదు.

**3) స్మరణము :–** దీనినే మననం అని కూడా అంటారు. మళ్ళీ మళ్ళీ స్మరించాలి. అంటే మననం చేసుకోవాలి. దీనినే జపించడమని కూడా అంటారు. ఎందుచేతనంటే అంతటి గొప్పవాడైన భగవంతుని మరచిపోతే, ముక్తి ఎలా వస్తుంది. అందుచేత మళ్ళీ మళ్ళీ భగవంతుని స్మరించడం ద్వారా గుర్తు చేసుకోవాలి. మరి అలా గుర్తుంచు

కుంటే సరిపోతుందా? అంటే సరిపోదు దానితో బాటు ఇంకా కొన్ని చెయ్యాలి.

**4) పాదసేవనము :–** నేను భగవంతుని సేవకుడనని భావిస్తూ, ఆయన రూపమయిన ఈ జగత్తుకు అంటే ఈ జగత్తులోని వాటికి సేవ చెయ్యాలి. అంకిత భావంతో చెయ్యాలి. పవిత్ర భావంతో పాదాలకు ఎలా సేవ చేస్తామో అంతే పవిత్ర భావంతో లోకానికి సేవ చెయ్యాలి. ముఖ్యంగా భగవంతుడు అంటే ఒక బొమ్మ లేక ఒక రూపమని భావించకూడదు. అన్నీ భగవంతుడే అంతా భగవంతుడే అని తెలుసుకోవాలి. ఆ భావంతోనే సేవ చెయ్యాలి.

**5) అర్చనము :–** దీనినే ఆరాధనా భావం అంటారు. అంతటి గొప్పవాడైన భగవంతుని పట్ల ఆరాధనా భావం అంటే ఆర్తి కలిగివుండాలి. ఆయన గురించి, ఆయన యొక్క సర్వ వ్యాపక తత్వం గురించి తెలుసుకోవాలి. అన్నీ ఆయన రూపాలే అన్న సంగతి తెలుసుకోవాలి. అందరి పట్ల, అన్నిటి పట్ల ఆరాధనా భావంతో ప్రవర్తించాలి.

**6) వందనం :–** దీనినే వినయం అని కూడా అంటారు. భగవంతుని పట్ల వినయంతో మెలగాలి. అంటే ప్రతి ఒక్కరి పట్ల వినయం ప్రదర్శించాలి. విధేయత కలిగి వుండాలి. అలా ఎవరైతే ప్రవర్తిస్తారో వారు భగవంతునికి దగ్గర కాగలుగుతారు. భగవంతునికి దగ్గర అయ్యే కొద్దీ ముక్తికి దగ్గరయినట్టే.

**7) దాస్యం :–** దీనినే సేవ అంటారు. పైవాటితో పాటు భగవంతునికి సేవ చెయ్యాలి. అదే భగవంతునికి ఆనందం కలిగించేది. మరి భగవంతునికి సేవ చెయ్యడం ఎలా? అన్నీ భగవంతుని స్వరూపాలే కాబట్టి. అన్నిటికీ, అందరికీ సేవ చెయ్యాలి. ఒక మొక్కను చక్కగా పోషించినట్లయితే అది మొక్కకు చేసే సేవ. ఒక ఆవుకు, ఏ సమయానికి ఏది కావాలో అది సమకూరిస్తే అది జంతువుకు చేసే సేవ. అలాగే తల్లిదండ్రులకు, ఇతర కుటుంబ సభ్యులకు ఏ లోటు లేకుండా చూసుకుంటే అది తల్లిదండ్రుల సేవ అవుతుంది. అలా అందరికీ చేసే సేవే భగవంతునికి చేసే సేవ. అందుకే "మానవ సేవే మాధవసేవ" అన్నారు. ఇలా చేస్తూ ఇంకొక ధర్మం పాటించాలి.

**8) సఖ్యము :–** దీనినే స్నేహము అని కూడా అంటారు. అందరూ, అన్నీ భగవంతుని రూపాలే కాబట్టి! అన్నీ సమానం కాబట్టి ఇక్కడ ఎక్కువ తక్కువ లేవు కాబట్టి! అందరితో అన్నిటితో స్నేహం చెయ్యాలి. సృష్టిలో మానవులు పాటించవలసిన ఒక గొప్ప ధర్మం. "స్నేహ ధర్మం". అలా ఎవరయితే మానవులతోనే కాకుండా అన్ని జీవులతో, జంతువులతో స్నేహంగా వుంటారో! స్నేహం చేస్తారో! వారు భగవంతునికి ఇంకా దగ్గర అవుతారు. అంటే జీవహింస చేయకూడదు.

జీవులతో స్నేహం చెయ్యాలి. వేటికీ కష్టం కలిగించకూడదు. అన్నిటిలో ఇష్టంగా వుండాలి అలా అన్నిటితో ఇష్టంగా వున్నవారు భగవంతునికి కూడా ఇష్టులవుతారు.

**9) ఆత్మ నివేదన :–** దీనినే ధ్యానం అని కూడా అంటారు. చివరిగా ఎవరయితే

ఇవన్నీ చేస్తూ ధ్యానం కూడా చేస్తారో వారు ఆత్మను నివేదించిన వారవుతారు. చివరకు భగవంతుని చేరతారు. ముక్తిని పొందుతారు.

అలా ఎవరైతే ఈ నవ విధ భక్తుల ద్వారా భగవంతుని చేరతారో వారి జీవితం ధన్యమైనట్టే. అందుచేత ఈ తొమ్మిది రకాల భక్తులు మానవుడు ఆచరించ వలసిందే. తెలుసుకోండి భగవంతుని చేరడానికి 9 రకాల భక్తి మార్గాలున్నాయి. ఏ మార్గంద్వారానైనా భగవంతుని చేరవచ్చు అని సాధారణంగా చాలా మంది భావిస్తారు. కానీ భగవంతుని చేరడానికి ఏదో ఒక మార్గం కాదు ఈ తొమ్మిది మార్గాలూ అవసరమే.

కారణం భగవంతుని గురించి ఏమీ తెలియని వారికి మొదటి ఎనిమిది మార్గాలు భగవంతుని గురించే కాకుండా భగవంతుని విషయంలో ఏమి చెయ్యాలో, ఎలా ప్రవర్తించాలో తెలియచేస్తాయి. ఆఖరిదైన తొమ్మిదవ మార్గమైన ఆత్మనివేదన అంటే ధ్యానం మాత్రమే భగవంతుని చేరుస్తుంది.

ఈ విషయమే 21వ అధ్యాయం, 159వ పేజీలో అనంతరావు పాటంకర్ శాంతి ప్రసాదించమని కోరినపుడు బాబా ఒక నీతి కథను ఈ విధంగా చెప్పారు.

**"ఒకనాడొక వర్తకుడు ఇక్కడకు వచ్చెను. అతని ముందు ఒక ఆడగుర్రం లద్దె వేసెను. అది తొమ్మిది వుండలుగా పడెను. జిజ్ఞాసుడైన ఆ వర్తకుడు పంచె కొంగు సాచి తొమ్మిది వుండలు అందులో పెట్టుకొనెను. ఇట్లు అతడు మనస్సును కేంద్రీకరించగలిగెను".**

ఈ మాటలు పాటెంకర్‌కు అర్థం కాలేదు. అపుడు ఆయన దాని అర్థం దాదాకేల్కరును అడిగాడు. "ఆ మాటలలో బాబా ఉద్దేశ్యమేమి? దానికి కేల్కరు ఇలా చెప్పాడు.

**"ఆడగుర్రమనగా ఇచట భగవంతుని అనుగ్రహము, తొమ్మిది వుండల లద్ది అనగా నవ విధ భక్తులు".** వీటిని అనుసరించిన యెడల భగవంతుడు సంతుష్టి చెందును అని సమాధానం చెప్పాడు.

ఆయన ఇంకా నీవు కూడా ఆ వర్తకుడననుకొనుము. వానివలె నవ విధ భక్తులను ప్రోగు చేయుము. వాని వలె ఆచరణలో పెట్టుము. అపుడు నీకు మనస్థైర్యము, శాంతి కలుగునని చెప్పడం జరిగింది.

ఆ మరుసటి దినము పాటంకర్ బాబాకు నమస్కరించుటకు పోగా బాబా **"తొమ్మిది గుర్రపు లద్ది ఉండలను ప్రోగు చేసినావా? లేదా?"** అని ప్రశ్నించెను.

అంటే దీని అర్థం. ఎవరైనా తొమ్మిది వుండలు పోగు చేసుకోవాలని బాబా చెప్పినట్టే కదా? అంటే నవ విధ భక్తులు అవసరమే కాదు ఆచరించాలి కూడా. అంటే భగవంతుని పొందటానికి తొమ్మిది రకాలుగా ఆరాధించాలి. ఏదో ఒక్కటి సరిపోదనే దీని అర్థం. అందుచేత అన్నీ ఆచరిస్తూ ఆఖరిదైన ఆత్మ నివేదన వల్ల అంటే ధ్యానం వల్ల తేలికగా భగవంతుని చేరగలం. ఆత్మను సాక్షాత్కరించు కోగలం. శాంతిని పొందగలం.

# ఆత్మనివేదన!

## (ఆలయాలలో కొబ్బరి నివేదనకు అంతరార్థం)

భక్తులను 9 రకాలుగా పేర్కొన్నారు. వారిలో (1) శ్రవణం చేసేవారు. (2) మననం చేసేవారు. (3) కీర్తనలు చేసేవారు. (4) పాద సేవలు చేసేవారు, (5) అర్చనలు చేసేవారు, (6) వందనాలు చేసేవారు, (7) దాస్యం చేసేవారు, (8) సఖ్యం చేసేవారు వున్నారు. కానీ వీరందరి కంటే కూడా 9వ వారైన 'ఆత్మ నివేదన' చేసే భక్తులంటే షిరిడి సాయిబాబాకు చాలా ఇష్టం. ఆత్మ నివేదనే ఆయనకు ప్రీతికరమైనది. మిగిలిన అన్ని రకాల భక్తుల కంటే ఆయనకు అత్యంత ప్రీతికరమైన వారు ఆత్మ నివేదన చేసే వారేనని ఆయన చెప్పడం జరిగింది.

మరి బాబాకు ఇష్టులు కావాలన్నా, ఆయనకు ఇష్టమైనది నివేదించాలన్నా, అంటే ఆయన ఇష్టపడేది సమర్పించాలన్నా, **'ఆత్మనే నివేదించాలి'.** నిజమైన భక్తుడు ఎవరు? అంటే, **"కష్టమైనదైనా దేవునికి ఇష్టమైనది సమర్పించేవాడే".** అంటే ఏ భక్తుడైనా సరే తనకు ఎంత కష్టమైనా దేవునికి ఇష్టమైన పని చేసినవాడే దేవునికి ఇష్టుడవుతాడు. అపుడే ఆయన అనుగ్రహం పొందగలుగుతాడు.

గుర్తుంచుకోండి దేవుని అనుగ్రహం కలగాలంటే **"మనకు దేవుడు ఇష్టమైతే సరిపోదు. మనం దేవునికి ఇష్టులు కావాలి"**. ఇదిముఖ్యం. అందుచేత మనకి ఇష్టమైనవి సమర్పించడం కాదు. దేవునికి ఇష్టమైనవి సమర్పించాలి.

మరి షిరిడీ సాయిబాబాకు ఇష్టమైనది ఏదీ అంటే "ఆత్మ నివేదన". మరి ఆత్మను నివేదించాలంటే ఎలా? ఏం చెయ్యాలి? ఒక్క సాయిబాబాకే కాదు, అందరి దేవుళ్ళకు ఇష్టమైన ఆత్మ నివేదనా మార్గాన్ని పూర్వకాలపు పెద్దలు మనకు కొబ్బరి నివేదన ద్వారా చూపించారు. అంటే ఆలయాలలో కొబ్బరి నివేదించటానికి కారణం, అంతరార్థం అదే. ఏ ఆలయాలలో చూసినా, ఎక్కడ చూసినా అన్నిటికంటే కొబ్బరి నివేదనకు ప్రాముఖ్యం ఇస్తారు. కొబ్బరి నివేదన, ప్రాముఖ్యం సంతరించుకోవడానికి అంతరార్థం ఇదే. కొబ్బరి నివేదనే ప్రశస్తమైనదని పూర్వీకులు పేర్కొనటానికి కారణం, అంతరార్థం ఇదే. కొబ్బరి నివేదనకు అర్థం 'ఆత్మ నివేదనే!' ఆత్మనివేదనను సూచించేదే కొబ్బరి నివేదన. అందుకే కొబ్బరికి అంత ప్రాశస్యత.

ఎందుచేతనంటే కొబ్బరికాయ లోపల (అంతరంలో) వున్న స్వచ్ఛమైన తెల్లటి కొబ్బరిని నివేదించాలంటే ముందు పైన వున్న తొక్కతియ్యాలి. తరువాత పనికి రాని పీచు వలవాలి. తరువాత తెల్లటి కొబ్బరిపైన గట్టిగా వున్న పెంకును

బద్దలు కొట్టాలి. అప్పుడు కొబ్బరి కనపడుతుంది. అప్పుడే దాన్ని నివేదించగలం. అప్పుడు తియ్యటి నీరు కూడా లభిస్తుంది.

అలాగే అంతరంలో వున్న స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన 'ఆత్మ'ను నివేదించాలంటే మొదట పైన వున్న తొక్కలాంటి శరీరాన్ని వదలాలి. అంటే కళ్ళుముయ్యాలి. తరువాత లోపల మనసులోని పనికి రాని 'అరిషడ్ వర్గాలు' అంటే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే గుణాలు అనే పీచును తొలగించాలి. ఆ తరువాత 'ఆత్మ'ను ఆవరించి గట్టిగా పెంకులా వున్న 'నేను' అనే అహంకారాన్ని పగలగొట్టాలి. అంటే తొలగించాలి. అప్పుడే మనకు కొబ్బరి లాంటి స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన ఆత్మ సాక్షాత్కారమవుతుంది. అంటే కనబడు తుంది. అప్పుడే ఆత్మను నివేదించగలం. అప్పుడే మనకు తియ్యటి నీరు లాంటి అంతులేని ఆనందం కూడా లభిస్తుంది. శాశ్వతానందం లభిస్తుంది. జన్మధన్యమవుతుంది.

**"కొబ్బరి నివేదించడమంటే అర్థం ఆత్మను నివేదించాలని".** దేవుడు కొబ్బరి ఇష్టపడతాడు అంటే ఆత్మను ఇష్టపడతాడని అర్థం. మరి అలా ఆత్మను నివేదించా లంటే చేయవలసింది 'ధ్యానం'. 'ధ్యానం' ద్వారానే **"ఆత్మ నివేదన"** చెయ్యగలం.

ధ్యానంలో మొదట కళ్ళు మూస్తాం. దేహాన్ని వదులుతాం. తరువాత "శ్వాస మీద ధ్యాస" వుంచి మెల్లి మెల్లిగా మనసును నిశ్చలపరుస్తాం. మెల్లిగా మనస్సు శుద్ధి చేస్తాం అంటే నిర్మలం చేస్తాం. అరిషడ్ వర్గాల ప్రాముఖ్యం లేకుండా చేస్తాం. ఆ తరువాత నేను అన్న అహంకారాన్ని కూడా తొలగిస్తాం. ఆత్మ స్థితిలో వుంటాం. అలా ఆత్మను నివేదిస్తాం.

ధ్యానం చెయ్యనివారు కొబ్బరిని మాత్రమే నివేదించగలరు. అలా కొబ్బరిని నివేదించిన వారు దేవుని విగ్రహాన్ని మాత్రమే దర్శించగలరు. కానీ కొబ్బరి సమర్పించడంలోని అంతరార్థం గ్రహించి ధ్యానం ద్వారా ఆత్మను నివేదించినవారు ఆ దేవుని సత్య రూపాన్ని అంటే నిజమైన దేవుణ్ణే దర్శించగలరు.

అందుకే షిరిడీ బాబా ఆత్మ నివేదన చెయ్యమన్నారు. అంటే ధ్యానం చెయ్యమనే బాబా వారి సందేశం. అందుకే బాబా వారి ఆలయాలలో ధ్యాన మందిరాలు నిర్మించటానికి కారణం. అందుచేత గుళ్ళలో కొబ్బరికాయలు సమర్పించి విగ్రహ దర్శనంతో సరిపెట్టక, అక్కడే వున్న ధ్యాన మందిరంలో ధ్యానం చేసి, ఆత్మ నివేదన ద్వారా బాబానే దర్శించండి. 'బాబా'కి ఇష్టులు కండి. జీవితాలు ధన్యం చేసుకోండి. ఇదే బాబా సందేశం.

# బాబా మనుషులు ఎవరు?

28 అధ్యాయం, 207 పేజీలో బాబా యీ విధంగా చెప్పారు.

**"నా మనుష్యుడు ఎంతదూరమున ఉన్నప్పటికీ 1000 కోసుల దూరమున ఉన్నప్పటికీ పిచ్చుక కాళ్ళకు దారము కట్టి యీడ్చినటుల అతనిని షిరిడీకి లాగెదను".**

ఇక్కడ బాబా 'నా మనుష్యుడు' అన్నారంటే ఆయన మనుష్యులు కాని వారు కూడా వున్నారా? అనే సందేహం కలగవచ్చు. ఆయనకు అందరూ ఒక్కటే అందరూ ఆయన మనుష్యులే. కానీ ఎవరైతే ఆయన యందు ఆసక్తి కలిగి వుంటారో! ఆయనను చేరాలనే తపన, ఆర్తి కలిగి బాబా ఎక్కడ వుంటారో తెలియక, ఎక్కడకు వెళ్ళాలో తెలియక తపనపడుతూ వుంటారో అలాంటి వారని అర్థం.

లోకంలో బాబా భక్తులు రెండు రకాల వారు వున్నారు. ఒకరకం వారు బాబాను చేరాలనే తపనలో వుంటారు. రెండవ రకం వారు ఇహ పరసౌఖ్యాల పట్ల ఆసక్తి చూపిస్తూ వాటిపై అంతులేని మమకారం పెంచుకొని, వాటి కోసం ప్రయత్నిస్తూ, వాటిని పొందటానికి రకరకాల ప్రయత్నాలు చేస్తూ, వాటి కోసం చేయకూడని పనులు చేస్తూ అవి పొందలేకపోయామని నా వల్ల కావడం లేదని వాటి కోసం బాబాను ఆశ్రయించేవారు.

బాబా "నా మనుషుడు" అని పేర్కొన్నది. మొదటి రకం వారి గురించి. అటువంటి వారు **"1000 కోసుల దూరాన వున్నా పిచ్చుక కాలికి దారము కట్టి యీడ్చినటుల అతనిని షిరిడీకి లాగెదను".** అంటే నా దగ్గరకు అతనిని రప్పించుకొందును అని బాబా వారు చెప్పడం జరిగింది. అంటే ఎవరైతే అన్నిటి మీద మమకారం వదలి భగవంతుని మీద ఆర్తి, ఆసక్తి కలిగి వుంటారో వారే భగవంతుని ఆకర్షించగలుగుతారు. ఆయన దృష్టిలో పడతారు. వారి అనుగ్రహానికి పాత్రులవుతారు. ఆయనను పొందే అర్హత సంపాదిస్తారు. ఆయనను చేరే మార్గం తెలుసుకోగలుగుతారని బాబా మాటల సందేశం.

ఎందుచేతనంటే రెండవ రకం వారికి బాబా కంటే కూడా బాబా ఇచ్చేవే ఇష్టం. వారు బాబాని ఇష్టపడుతున్నారంటే బాబా అన్నీ ఇస్తాడని ఇష్టపడుతున్నారు. ఇవ్వకపోతే కష్టం కూడా! అడిగినవి ఇవ్వకపోతే మెల్లిగా ఇష్టం తగ్గిపోతుంది. అందుచేత కోరికల కోసం బాబాను ఆశ్రయించేవారు బాబా ఇచ్చే వాటిని ఇష్టపడుతున్నట్టు కానీ బాబాని కాదని స్పష్టంగా తెలుసుకోవచ్చు.

కొంచెం ఆలోచించండి. మనం భగవంతుని ఇష్టపడకపోతే భగవంతుడు మనల్ని ఎలా ఇష్టపడతాడు? మనకు భగవంతుని చేరాలనే తపన లేకపోతే

భగవంతుడు ఆయవైపు ఎలా రప్పించుకుంటాడు? మనకు ఇష్టం లేని పని ఆయన చేస్తాడా? అందుచేత ఎవరు 'బాబా మనుషులు' అంటే బాబాను ఇష్టపడేవారు. బాబాను చేరాలన్న తపన వున్నవారు.

ఎందుచేతనంటే ప్రతీ ఒక్కరూ బాబా అంటే నాకిష్టం. నాకిష్టం అంటారు. అంతకన్నా ఆలోచించరు. గుర్తుంచుకోండి **"మీకు బాబా ఇష్టమైనంత మాత్రాన సరిపోదు. బాబాకు మీరు ఇష్టులవ్వాలి".** మరి బాబాకు ఇష్టులవ్వాలంటే ఏం చెయ్యాలి? బాబాకు ఎవరు ఇష్టులు? అంటే బాబాను ఆరాధించే వారు కాదు. బాబా చెప్పింది ఆచరించేవారే ఆయనకు ఇష్టులవుతారు. వారినే ఆయన ఎక్కువ ఇష్టపడతారు.

ఆలోచించండి చాలా మంది మేము బాబా భక్తులం, బాబా భక్తులం అని చెప్పుకుంటారు. కానీ **"మనం బాబా భక్తులమని అనుకున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. దానికంటే 'వీడు నా భక్తుడు' అని బాబా అనుకోవాలి".** వాడే గొప్పవాడు, వాడే అదృష్టవంతుడు, వాడి జీవితమే ధన్యం. అటువంటి వారినే బాబా "నా మనుషుడు" అని భావిస్తారు. వారినే తన వైపునకు రప్పించుకుంటారు. వాడు ఎక్కడ వున్నా తన దగ్గరకు రప్పించుకుంటారు.

అందుచేత మనం కూడా ఆయన ఇష్టుల లిస్టులో చేరాలి. ఆయన దృష్టిలో ఆయన మనిషిగా గుర్తింపబడాలి. దానికి ఆయనను ప్రార్థించడం కాదు. ఆయన చెప్పినవి పాటించాలి. మరి ఏం పాటించాలి? (128వ పేజీలో ఆత్మ సాక్షాత్కారానికి యోగ్యతలో 2వ నియమం) ఇహపర సౌఖ్యములందు విరక్తి లేదా విసుగు చెందుట. అంటే ఇహలోక సుఖాల పట్ల ఆసక్తి వదలాలి. అంటే ఏ సౌఖ్యాలు కావాలని, ఇవ్వమని బాబాను వేడుకుంటున్నామో వాటి పట్ల ఆసక్తి కలిగి వుండకూడదు. ఇంకా ఇంకా కావాలని కోరకూడదు. వున్న వాటితో, ఇచ్చిన వాటితో తృప్తి చెందాలి. మనకు ఏదైతే వుందో! వాటిని అనుభవించాలి. ఎదుటి వాడికి వుందని ఏడవకూడదు. నాకు లేదని బాధపడకూడదు. దీనినే తృప్తి అంటారు. అలా అనుభవిస్తూ భగవంతుని మీద ఆసక్తి పెంచుకోవాలి. అటువంటి వాడే భగవంతుని మనిషి అవుతాడు. ఇదే బాబా సందేశం.

ఇక్కడ ఇంకా ఆలోచించాలి. బాబాను ఇష్టపడాలన్నా, బాబా పట్ల ఆసక్తి పెంచుకోవాలన్నా, బాబాను చేరాలన్నా, ఇంతకీ "బాబా ఎవరు?" అంటే ఇంతకు ముందే మనం చెప్పుకున్నాం. "ఆత్మే బాబా" అని. అందుచేత ఆత్మను ఇష్టపడండి. ఆత్మ పట్ల ఆసక్తి పెంచుకోండి. ఆత్మను చేరడానికి ప్రయత్నించండి. ఆత్మ మీద దృష్టి వుంచండి.

**'ఆత్మ' అంటే 'బాబా' ఎక్కడ వున్నారు? 28వ అధ్యాయం 208వ పేజీలో ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది "శ్రీ సాయి అనంతుడు, చీమలు పురుగులు**

**మొదలుకొని బ్రహ్మపర్యంతము సకల జీవులందు వసించును. వారు సర్వాంతర్యామి"**
(సర్వ జీవుల, ప్రాణుల, మానవుల అంతరంలో అంటే లోపల వ్యాపించి వున్నవాడు).

అంటే బాబా మనలోనే ఆత్మ రూపంలో వున్నారు. అందుచేత దేహం మీద కాకుండా ఆత్మ మీద ఆసక్తి పెంచుకుంటే బాబా మీద ఆసక్తి పెంచుకున్నట్టే. దేహ సుఖాలు కాకుండా ఆత్మ సాక్షాత్కారం మీద ఆసక్తి పెంచుకుంటే బాబా మీద ఆసక్తి పెంచుకున్నట్టే. అలాంటి వాడే 'బాబా మనుష్యుడు'. అందుకే బాబా బోధించిన ఆత్మ సాక్షాత్కార మార్గం 10వ పాయింటు భగవంతుని కటాక్షములో బాబా యీ విషయమే స్పష్టంగా చెప్పడం జరిగింది.

మరి దేహ దృష్టి మాని ఆత్మ మీద దృష్టి పెట్టాలంటే ఏం చెయ్యాలి. ఆత్మ మనలోనే వుంది కాబట్టి మనం అంతర్ముఖులు కావాలి. అంటే ధ్యానం చెయ్యాలి. అంటే ఎవరైతే ధ్యానం చేస్తారో వారు బాబా మీద దృష్టి పెట్టిన వారవుతారు. బాబాను ఇష్టపడిన వారవుతారు. అలా ధ్యానం చేసే వారిని తన దగ్గరకు రప్పించుకుంటానని బాబా చెప్పడం జరిగింది.

సద్గురువు చెప్పే చిన్న మాటలో ఎంతో అర్థం వుంటుంది. అటువంటి వారు చెప్పే మాటల్లో బాహ్యార్థం తీసుకుంటే మనమే నష్టపోతాం. కానీ వాటి అంతరార్థం తీసుకోగలిగితే మన జీవితమే ధన్యమవుతుంది. చూడండి ఎన్నో సందర్భాలలో బాబా మాటలు చాలా మందికి అర్థం కావు. ఆలోచిస్తే వాటి అర్థం తెలుసుకోగలుగుతాం. ఆయన అర్థం లేకుండా ఏ మాట మాట్లాడరు. ఆయన దగ్గర అర్థం లేని మాటలు వుండవు. అన్నీ అర్థవంతమైనవే వుంటాయి. కొన్ని ఉదాహరణలు చూద్దాం (14వ అధ్యాయం 17వ పేజీ)

(1) బాబా 15 రూపాయలు దక్షిణ ఇమ్మని ప్రొఫెసర్ జి.జి.నార్కేను అడుగగా, అతడు తన వద్ద దమ్మిడీ అయినను లేదనెను. దానికి బాబా యిట్లనెను **"నీ వద్ద ధనము లేదని నాకు తెలియును, కానీ నీవు యోగ వాశిష్ఠము చదువుచున్నావు గదా? దాని నుంచి నాకు దక్షిణ ఇమ్ము!"**

ఇక్కడ బాబా అడిగిన 15 రూపాయలు దక్షిణకు అర్థం యోగవాశిష్టంలో ఆయన చదివిన వాటిలో 15 జ్ఞానవంతమైన విషయాలు తనకు చెప్పమని.

(2) ఇంకొకసారి తర్ఖడ్ భార్యను ఆరు రూపాయలు దక్షిణ ఇమ్మని బాబా అడిగారు. తన వద్ద పైకం లేకపోవడం వల్ల ఆమె మిగుల చిన్నపోయెను. అప్పుడు అక్కడే వున్న ఆమె భర్త బాబా వాక్కులకు అర్థము చెప్పెను.

"తన ఆరుగురు శత్రువులను అంటే కామ, క్రోథ, లోభ, మోహ, మధ, మాత్సర్యాలను తమకు పూర్తిగా సమర్పించవలెనని" బాబా భావమని అతడు తన భార్యకు వివరించెను. దానికి బాబా పూర్తిగా సమ్మతించెను.

(3) (119వ పేజీ) తన దగ్గరకు వచ్చిన భక్తులకు బాబా రెండు రకాల పరీక్షలు పెట్టేవారు. (1) దక్షిణ, (2) రాధాకృష్ణమాయి. తన భక్తులు ఈ రెండింటిని ఎంత విడిచిపెట్టారో చూడటానికి భక్తులు తన వద్దకు రాగానే బాబా దక్షిణ అడిగి పుచ్చుకొని "బడికి" (రాధాకృష్ణ మాయీ గృహమునకు) పంపుచుండిరి. ఈ రెండు పరీక్షలు తట్టుకున్నచో అనగా కనకము నందు (ధనమునందు) కాంతయందు (స్త్రీలోలత్వము) అభిమానము పోయినదని నిరూపించినప్పుడు బాబా దయ వలన ఆశీర్వాదము వలన వారి పారమార్థిక ప్రగతి శీఘ్రమగును.

దీనిని బట్టి బాబా ధనానికి కోరికలకు ప్రాముఖ్యం ఇవ్వరని తెలుసుకోవచ్చు. అందుచేత మనం సమర్పించే కొబ్బరికాయలు, అరిటిపళ్ళు, లేక హుండీలో వేసే కానుకల మీద వారు ఆసక్తి చూపించరని, అవి వారికి అవసరం లేదని, వాటికి ఆయన ప్రాముఖ్యం ఇవ్వరని తెలుసుకోవచ్చు. ఆయన ఎంతసేపూ మన చెడు గుణాలు సమర్పించమంటారు. అంటే వదలమంటారు. అలాగే ధనాన్ని ఇవ్వడం కాదు. ధనం మీద వున్న వ్యామోహాన్ని ఇవ్వాలి. కోరికలు పెంచుకోవడం కాదు. కోరికలు తగ్గించుకోవాలి. అదే బాబా కోరుకునేది. దానినే దక్షిణ రూపంలో కోరుకుంటారు. దక్షిణ కోరుతున్నారు అంటే అర్థం బాబా ధనం కోరుతున్నారని కాదు. అందుచేత ధనం, కానుకలు సమర్పించి మురిసిపోయే వారు భంగపడవలసిందే.

(4) **బాబా విభూది ఇవ్వడంలో అంతరార్థం** (33వ అధ్యాయము, 246వ పేజీ) :-

**"ఊది వలన బాబా ఏమి బోధించనుద్దేశించెను? ప్రపంచంలో కనిపించు వస్తువులన్నియు బూడిద వలె అశాశ్వతములు, పంచభూతములచే చేయబడిన మన శరీరములన్నియు సౌఖ్యములు అనుభవించిన పిమ్మట పతనమై పోయి బూడిదయగును. ఈ సంగతి జ్ఞప్తికి తెచ్చుటకి బాబా భక్తులకు ఊది ప్రసాదము పంచిపెట్టుచుండెను. ఈ "ఊది" వలననే బ్రహ్మము (భగవంతుడు) నిత్యమనియు, ఈ జగత్తు అశాశ్వతమనియు, ప్రపంచములో గల బంధువులు, కొడుకు గాని, తండ్రిగాని, తల్లి గాని మన వారుకారని బాబా బోధించెను".**

అందుచేత తెలుసుకోండి ఏవైతే భక్తులు కోరుతున్నారో అవి బూడిదతో సమానం. వాటి మీద మమకారం వదలమని ఊది ఇవ్వడం ద్వారా బాబా బోధిస్తున్నారు. ఇవి అర్థం చేసుకుంటే మనకు ఇవ్వబడిన వాటితో, మనకు ఉన్న వాటితో తృప్తి చెందుతాం. భగవంతుని చేరే ప్రయత్నం చేస్తాం. అంటే బాబా చెప్పినట్టు ధ్యానం చేస్తాం. అలా బాబా చెప్పిన విధంగా ఎవరైతే జీవిస్తారో వారి జీవితమే ధన్యమవుతుంది. శాశ్వతంగా దుఃఖం నుంచి బయటపడతారని తెలుసుకోవచ్చు. అందుచేత ధ్యానానికి ప్రాముఖ్యం ఇవ్వండి. ధ్యానం చెయ్యండి.

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

| | |
|---|---|
| 1) జీవితశాస్త్రం (మొదటి భాగం) | - రూ.130/- |
| 2) జీవితశాస్త్రం (రెండవ భాగం) | - రూ.130/- |
| 3) జీవిత సత్యాలు | - రూ.130/- |
| 4) భగవంతుడంటే | - రూ.130/- |
| 5) సత్యమార్గం | - రూ.130/- |
| 6) ఆత్మ శాస్త్రం | -రూ.1300/- |
| 7) ధ్యాన శాస్త్రం | - రూ.130/- |
| 8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) | - రూ.130/- |
| 9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) | - రూ.130/- |
| 10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం | - రూ.130/- |
| 11) ధ్యాన శక్తి | - రూ.130/- |
| 12) తెలుసుకోండి | - రూ.130/- |
| 13) జీవిత సూక్ష్మాలు | - రూ.130/- |
| 14) గీతాసందేశం | - రూ.100/- |
| 15) కర్మ సిద్ధాంతం | - రూ.80/- |
| 16) ధ్యానమంటే ? | - రూ.80/- |
| 17) ఆత్మజ్ఞానం ఎందుకు? | - రూ.70/- |
| 18) జ్ఞాన జ్యోతి | - రూ.70/- |
| 19) జ్ఞాన కుసుమాలు | - రూ.70/- |
| 20) దుఃఖ నివారణామార్గం | - రూ.60/- |
| 21) బ్రహ్మజ్ఞానం | - రూ.60/- |
| 22) త్రివిధాలు | - రూ.60/- |
| 23) ధ్యానం (పత్రీజీ) | - రూ.60/- |
| 24) ధ్యానం వల్లనే జ్ఞానం | - రూ.60/- |
| 25) అతీంద్రియ శక్తులు | - రూ.60/- |
| 26) శాస్త్రాల అర్థం- అంతరార్థం | - రూ.60/- |
| 27) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య | - రూ.60/- |
| 28) భూతదయే దైవత్వం | - రూ.60/- |
| 29) ఆలోచించండి | - రూ.60/- |
| 30) సంకల్పమంటే? | - రూ.50/- |
| 31) ఈ జీవితం ఎందుకు? | - రూ.50/- |
| 32) ఆశ్చర్యం... ఆశ్చర్యం | - రూ.50/- |
| 33) నిర్వాణ మార్గం | - రూ.50/- |
| 34) షిరిడీ సాయి సందేశాలు | - రూ.40/- |
| 35) భాగవత సన్నివేశాల అంతరార్థం | - రూ.40/- |
| 36) మౌన ధ్యానం | - రూ.40/- |
| 37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) | - రూ.130/- |
| 38)మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? | - రూ.20/- |
| 39) శాకాహారమే మానవాహారం | - రూ.15/- |
| 40) అహింస మరియు శాఖాహారం | - రూ.15/- |

పుస్తకముల కొరకు :


తటవర్తి వీర రాఘవరావు,

తటవర్తివారి వీధి, భీమవరం-1. ప॥గో॥జిల్లా.

సెల్ : 9440309812, 9490171853



దేవుని భక్తులమనుకునేవారు దేవుళ్ళను ఆరాధించడం కాదు. వారు చెప్పింది ఆచరించాలి. దేవుళ్ళను ప్రార్థించడం కాదు. వారు చెప్పింది పాటించాలి.

దేవుడ్ని ఇష్టపడేవారు దేవుడు గురించి చెప్పిన దాని కంటే దేవుడు చెప్పిన దానికి ప్రాముఖ్యం ఇవ్వాలి. తనకు దేవుడు ఇష్టమైనంత మాత్రాన ప్రయోజనం లేదు. తాను దేవునికి ఇష్టుడవ్వాలని తెలుసుకోవాలి అప్పడే తన జీవితం ధన్యమవుతుంది.

మరి దేవునికి ఇష్టులవ్వాలంటే దేవుడు చెప్పిన సందేశాల అంతరార్థాన్ని తెలుసుకోవాలి. దానిని ఆచరణలో పెట్టాలి. ఇది చాలా ముఖ్యం.

షిరిడీ సాయి చెప్పిన సందేశాల అర్థాన్ని, అంతరార్థాన్ని వివరించి సాయి బోధించిన మార్గంలో పయనింప చేయడం కోసమే ఈ **"షిరిడీ సాయి సందేశాలు"**. పాఠకులు చదివి అర్థం చేసుకుని, ఆచరించి తరిస్తారని ఆశిస్తూ...

**మీ...**

**తటవర్తి వీరరాఘవరావు**